# రాధాకేళి

రచయిత

ఉభయభాషా ప్రవీణ

పరుచూరి రామకృష్ణ చౌదరి

తెనుఁగు పండితుఁడు

బోర్డు మిడిల్‌స్కూలు, పిట్టలవానిపాలెము



విలువ ౦-౮-౦

# తొలిపలుకు

ఇది కాశ్మీర రాజపుత్త్రిని గుఱించి విరచించిన విచిత్ర మగు నితివృత్తము. దాదాపు ఏఁబది సంవత్సరములకుఁ బూర్వము కాశిలో హిందీభాషను మాసపత్త్రికయందుఁ బ్రకటితము. తత్కథావైచిత్ర్య మక్షరాస్యుల కెల్ల నభిమానపాత్ర మని శ్రీధరపండితుఁడు "తిలిస్మాతీసుందరి" యను స్వైర గ్రంథరూపమునకుఁ దెచ్చినాఁడు.

ఇందలి కథాసంవిధానమును వైచిత్ర్యమును గమనించి కథలన్న నుబలాటపడు నేఁటి విద్యార్థుల కెంతయు నుపయుక్త మగునని యీ తెనుఁగుసేఁతకుఁ బూనుకొంటిని.

యథామూలముగ కథ వ్రాసిన నిప్పచ్చరముగ నుండునని యట నట వర్ణనలఁ జొప్పించితి. అందు ఆదిని గంగానదీ వర్ణనము, అంతమున రాధాకృష్ణుల పరిణయాదికము, వారికి రాజు గఱపిన నీతియుఁ బ్రధానములు. రచనాసారళ్యము తగ్గు పట్ల నరసున్నల నవ్వాలనుంచి సరళాదేశముల సరకుగొననైతి.

గ్రంథమునకు "కాశ్మీరరాజపుత్రి" యనియో "విచిత్రాంగుళీయక" మనియో పేరిడుట న్యాయ్యమైనను అవి యంత యింపుగా నుండవని తలంచి రాజపుత్రికి రాధాదేవి యను పేరొండు కల్పించి దానినే గ్రంథనామముగా నుంచితిని. ఇట్లే యింక గొన్ని పాత్రములకు క్రొత్తగ కొన్ని పేర్లు కల్పించితి. నేఁటి విద్యార్థులకు సులభావగాహమగు శైలినే యిందుఁ గూర్చితినని విశ్వాసము. గుణాగుణ విమర్శనము పండితాధీనము. అగుణమును దెల్పిన దిద్దుకొందునని మనవి.

శ్రీముఖ, మార్గశీర్షము
అమృతలూరు,
౧౨—౧౨—౧౯౩౪.

రామకృష్ణచౌదరి.

# సంస్మరణము

నిండు జవ్వనివై యెంతో నీటు గలిగి
కనుల కందవై హృన్మోదకరము నగుచు
విశ్వమాతయుఁ దానవై వెలయు ప్రకృతి
మధుర మూర్తిని స్మరియింతు మదిని సతము.

# రాధాదేవి

## మొదటి ప్రకరణము

హరిద్వారమునకు నుత్తరమునఁగల కొండలలో కడు దవ్వేగవలయు. అట గోవుమోమున కెనయగు కొండబిలమొండు కాననగును. అందుండి తోఁకత్రొక్కిన త్రాచువోలె బుస కొట్టుచు, ప్రళయ కాలాంబుదము చందమున గర్జసేయుచు, దరుల నున్న మోకుతిరుగని తరులసైతము మూలమట్టముగఁ బెకలించుచు, సుళ్లచే జలచరంబులకు నోఁజపిల్లు గావించుచు, వియద్గంగతో వియ్యమందనేఁగు చందమున తరంగపరంపరల నింగికెగఁ జిమ్ముచు, ప్రవాహవేగమున జీవరాసుల నట్టెటుగావించుచు, క్రుంకులిడ వచ్చిన తైర్థికులు తీరములనెండవైచిన ధౌత వస్త్రములో యన నురువులు గట్టుచు, ప్రపంచమంతయు నా కొఱకె యను దురాశావృతుఁడైన పిసినారి కోరికవోలె భూత లము నాక్రమించుచు, వారిధారయొకటి నిర్గమించుచుండును. అదియే లోకపావనియగు గంగాభవాని. అది నిర్గమించుమార్గ మును గోముఖమందురు. ప్రవహించు ప్రదేశమును గంగోత్రి యని వాకొందురు.

హిందువుల కది గొప్ప పుణ్యక్షేత్రము. దానిక్రుంకులు స్వర్లోక సోపానములనియు, తద్దర్శనము దేవలోక సందర్శనో పాయమనియు, తజ్జలపానము సకలపాప పరిహారమనియు, హిందువుల యాశయము.

అట్టి గంగోత్రి క్షేత్రము నికటంబునఁ గుటీరమొకటిగలదు-
అందొక యోగిపుంగవుఁడు వసించుచుండెను. నలువదికిఁ
దక్కువయు నేఁబదికి నెక్కువయుఁగాని వయసు కలవాఁడు.
అట్లయ్యు నాతని వాలకముఁ జూడ నతి వృద్ధుఁడుగఁ గాను
పించు. ఆకారమునఁ బొడుగరి. గోదుమచాయ మేను. ఫాలము
విశాలము. ముఖాకృతిం జూడ నార్యుఁ డనిపించు. దీర్ఘము విపు
లమునగు గడ్డము, విశాలమగు వక్షమునావరించి వింతసొబ
గును గూర్చుచుండెను. ఆతని దేహమార్దవముఁ బరికింప
జవ్వనమున మహాభోగి యని చెప్పనొప్పు. కాని మోమున
ముడుతలు లోనికింజనిన కనుగ్రుడ్లును-ఆతఁడు యోగి కావు
టకుఁ జెప్పరాని శోకభారమాతనిఁ జేరినదని చెప్పుచున్నవి.

ఆతనికిఁ బశుపక్ష్యాది జంతుజాలమన్న దటి లేనిదయ.
ఆతని డెందము మానవులయెడను, జంతువులయెడను, దాళా
లేనిదండె. సాధుమృగములట్ల ఘాతుకమృగంబులును నాతని
కిసుమంతేనియు నపకృతి సలుపక నిర్భీతిగ నాతనిచెంతఁ జేరు
చుడెండివి.

ఒకనాఁటి సాయంతనమున నయ్యోగివృద్ధుఁడు కుటీర
ద్వారమునఁ గూరుచుండి సహస్రభానుం డస్తాద్రికిఁ జను
చందముఁ బరికించుచుండ నాతని దృష్టిని కలహించు కాకంబులు
రెండాకర్షించె. ఆతీరు కలహించు జంటలో నొకటి గంగాప్రవా
హంబునంబడియె. పడుటయుఁ బక్షములు జలసిక్తములుగా
భారములయ్యె. కావున గగనమున కెగయ లేక ప్రవాహ

.వేగమున కగ్గంబై మునుంగుటకు సిద్ధంబయ్యె. అంత నయ్యోగి తటాలున నీటనుఱికి యద్దానిఁ దనయోగదండమున దీరంబుసేరందివిచి సురక్షితముగ నొనర్చె. అంతఁ బక్షుల నుండి నీరెడలఁగా తోడి దానింగూడి గోముఖోపరిభాగంబున నున్న ఱాతిబండమీఁదికి కావుకావుమనుచు నెగిరిచనియె. చని యటనున్న గుహాంతర్భాగము చేరి తోడనె వెలువడి యోగిపుం గవు పాదసన్నిధి నొకయుంగరంబునిచెను. ఆతఁడద్దానిం గైకొని తన యంగుళిని ధరించెను. తోడ్తోన కాకాలాంపబులు ప్రస్ఫుటం బులగుడు నాతఁడవధిలేన్ని యానందమనుభవించె. పిదపఁగాకం బు లావృద్ధయోగింగాచి "దయామయా ! యోగిపుంగవా ! పశుపక్ష్యాది జంతువులయెడ మీ దయారసంబు వెల్లివిరియుట ముదావహము. మఱియునేఁడు నా ప్రాణంబు కాపాడి పున్నెంబు గట్టుకొంటివి. ఇట్టినీయుపకృతికి నీయుంగరంబు బహూకృతి గావింతు. స్వీకరింపుఁడు. ఇది గారడివిద్దెల కాక రంబు. దీని ధరించువారు పశుపక్ష్యాదుల మాటల నవలీలగ గ్రహింపఁగలారు. వారు నియోగించు పనులకెల్లనవి వల్లెయని తలలొగ్గి తత్క్షణ మాచరింపఁగలవు. కార్యావసరం బేదేనిఁగ లుగుచో యథాశక్తి నవరింతుము. ఆనతిండు"నావిని వృద్ధుఁడు "ఔను! కార్యావసరం బొకటి కలదు. నేను తొలుతఁగాశ్మీర దేశమున కేలికను. కాని నాయల్లుఁడు నన్నురాజ్యభ్రష్టుఁగావించి రాజ్యంబపహరించె. అంత నేనీయోగివేషంబున దాఁగియుంటిని.. నాయిష్టంబు తీర్ప మీకుఁ గష్టంబుకాదేని కొండల కవ్వలఁగడు దవ్వులనున్న కాశ్మీరదేశ మేఁగి తద్దేశాధీశులైన దంపతుల

యోగక్షేమంబు లెఱింగిరాఁగోరెద. అగుచో మీకేనెంతయు కృతజ్ఞుడను" అని వచింపఁజిత్తము చిత్తమనుచు నవ్విహంగములు విహాయస వీధికేఁగుట తడవుగ నయ్యోగిదృక్పథంబునకు దూరంబులయ్యె.

యోగి కవి కనంబడి దినములు చాలగడచినవి. నాఁటి సాయంతనము యోగి తన కుటీరద్వారమునఁ గూర్చుండియుండె. ఆకసంబున నీలవర్ణంబులగు మచ్చలు రెండాతని దృగ్గోచరములయ్యె. చూడంజూడ నవి డగ్గఱై కాకంబులగుట తేటపడెను. అంతఁగాకంబు లాయోగిని డగ్గఱి యట నొకత్రిపాత్పీఠిక నెక్కి "ఱేఁడా! చెడ్డవార్తను జేరందెచ్చితిమి. కాశ్మీరదేశపు రాణియగు తమకూఁతురీ లోకము వీడి చనినది. ఆమెకొక కూఁతురు. పేరు రాధాదేవి. రాజు మఱల వివాహితుఁడయ్యె. తమకూఁతు కొక వయసుమీఱిన పెంపుడు శుకంబుండె. అద్దాని వలనఁగ్రొత్త రాణికి మీదౌహిత్రియన్న బొత్తిగాఁబొత్తు కుదురదని వింటిమి. మఱియు నా కుమతియగు రాణి రాజు వేఁటకై దవ్వేఁగెనేని మాతృహీనయు; పాపపుణ్యము లెఱుఁగని యాయమాయికయగు బిడ్డనే దుర్మరణంబుపాలు సేయునో యను భీతియుఁ బొడముచున్నయది" అని విన్నవించె.

అది వినిన వృద్ధయోగిచింత కంతంబు లేదయ్యె. ఆ చింతతో నా రాతిరి నిదుర లేదయ్యె. మఱునాఁటి ఱేపకడ యథారీతి కాకంబు లానదీతీరంబుచేర వానిరాఁబిలిచి నాయనుంగుఁజుట్టలారా, యీయంగుళీయకమును నాదౌహిత్రి కందింపుఁడు "నీకేదేని సాయంబుగాని యుపాయంబుగాని

వలయుచో నీపక్షులం దలంపుము. తమయోపినకొలంది తోడు సూపఁగలవు. అని నామాటగా నెఱింగింపుఁడు. మంచిది! నాదౌహిత్రి కీమాత్రము తోడుపడఁ గల్గితి" ననుచుఁ గన్నుల నీరు నిండ వృద్ధుఁ డాయుంగరమును గాకంబుల కందిచ్చెను.

పిమ్మట నవ్వాయసంబులు—చిత్తము—దేవరా! మీముదల తలఁదాలిచి మాయోపిన కొలంది తోడుపడుదుము. తేఁగల్గుచో నామెనే యిటకుఁ గొని తెత్తు మని వీడుకొని క్రమముగ నడవులు మడువులు దాఁటుచుఁ గొలంది దినంబులకే కాశ్మీరాధీశు సుందరమందిరంబు చొచ్చెను. అట కీరంబున కొగిరంబిడుచు నొంటిమై నుపవిష్టయై యున్న రాజపుత్రిం గాంచి యుంగర మాపె ముందఱ నునిచె. రాజపుత్రియు నది తన యంగుళిని ధరించినంతనె కాకాలాపంబు లవలీలఁగ గ్రహింపఁగలిగె. పిమ్మట నాద్విపాత్తులు—తాత చెప్పిపుత్తెంచిన వృత్తాంతంబు సాంతం బెఱిఁగింప, శుకం బాతనిరాజ్యచ్యుతిచందంబు వివరించెను. అదివిన్న రాజపుత్రి కన్నీరుమున్నీరుగా నేడ్చి యవ్వాయసంగని నా యనుంగుఁ జుట్టలారా, మీ యిచ్చవచ్చిన చొప్పున నన్ను నా తాతకడకుఁ జేర్పుఁడు. రాణి నాయందుఁ జూపు కాఠిన్య మింతింతనరాదు. తండ్రితో నా పడుపాట్లు విన్నవింతునేమో యని తా నున్నపుడు తక్క నన్ను నాతండ్రి కడకుఁ జేరి మాటాడ నీయదు. కావునఁ గన్నవానికైన నాయిక్కట్టులు విన్నవింప వీలుగాదయ్యె. అదిగాక సమయము చిక్కనేని నన్ను సమయింప సమకట్టుచున్నయది. ప్రియంబగు

నీ కీరంబొక్కటి తక్క నాహితవు కోరువారును నాయుదంతం బెఱుంగు వారు నేరును గానరారు" అని పచించె.

పిదప శుకంబు తోరంబగు ప్రేమరసంబు వెల్లివిరియ నాపె ముంజేతిని ముద్దిడుకొని— "నా యనుంగుబిడ్డా! నా మాటలు విశ్వసింపుము. నీయెడ నల్పమేని సాయపడఁగల్గుచో దాన దాఁపటికముంపను. నిన్ను నాబిడ్డగాఁ దలంచితి. నీవును నీ యమ్మయు నాకన్నుల ముందటఁ బుట్టి పెరిఁగినారలు. కాని నిన్ను నీ మాతామహునికడకుఁ జేర్చుట చూడ దుర్లభంబును, అపాయకరంబుగను గనుపట్టుచున్నయది. మఱియు మీ యయ్యవేఁటకై దవ్వేఁగెనేని దుర్మతియగు నీరాణికడ నీయునికి నుపేక్షించుటయు హితవుగాదు" అని యోదార్చి కాకంబులంగూడి రాజపుత్రీరక్షణోపాయంబరసి—దాని తర్కించి—మఱల శంకించియు, పునర్విమర్శనంబుగావించియు తుద కీతీరుగ సిద్ధాంతీకరించెను.

కాకంబులు రెండును మందిరోద్యానంబున నుండవలయు. అవసరంబగుచోఁ బిలిచినఁ బలుకుతీరు సలుపవలయు. కీరంబు రాజపుత్రిగదిలోనుండి మెలఁకువ గలిగి రాణి బాలికకేదేని నపాయం బాచరింప నుపాయం బరయుచో నద్దానిఁ బసిపట్టుచు నుండవలయు.



# రెండవ ప్రకరణము

కతిపయ దినములు గడచినవి. రాజు మృగయావినోదియై యడవిని గడుదవ్వున కేఁగెను. మఱునాఁడె రాణి యింటి నౌకరింజూచి "యోయీ! రేఁడు వేఁటకై కడు దవ్వేఁగెను. ఇఁక నింతలో రాఁడనుకొందు. సమయమెక్కువ చననీయరాదు. అగుచో విఘ్నంబులు రావచ్చును. కావున మన తోఁటలో నొకచోట విషౌషధులు కలవు. ఇప్పుడె నీవేఁగి యవ్వానింగొని వేగిరము రమ్ము. నావిని యాతఁడు వల్లెయని తోఁటకుంజని విషౌషధులు తెచ్చి రాణి కిచ్చెను.

పిదప రాణి విషపత్రములఁదఱిగి యొకపాత్రమున బాగుగ మఱఁగించెను. తోడనె కొంత ద్రవ మందుఁజేరుకొనెను.

అందుఁగొంత పిండియు, చక్కెర కొంతయుఁ గలిపి రొట్టెగఁజేసి కాల్చుచుండెను. అంతకు మున్నటఁ బొంచియున్న చిలుక, తోడనే రాజపుత్రియున్న గదికడకేఁగి యటనున్న కాకంబులంగాంచి-"అన్నలారా, యిఁక జాగుసేయరాదు. రాజపుత్రి యిట నుండరాదు. వేగిర మెటకేనిఁ దప్పి చన వలయు. రాణి విషౌషధులు కలిపి రొట్టె చేయుచున్నది. రాజపుత్రిని సమయింప నిది యొక పన్నుగడ కాఁబోలు" నని చెప్పి, రాజపుత్రింగాంచి-బిడ్డా! యిఁక లెమ్ము. ఇట నుండి పరుగెత్తుదమన విని రాజపుత్రి యెంతయు భీతిల్లి పరుగుపరుగున ద్వారంబుచేర నట కవాటము బంధింపఁబడియుండె. గవాక్షద్వార మెత్తుగానుంటచే నెక్కుటకు వీలుగాదయ్యె. తక్కుంగల

గవాక్షములకడ కావలివారు కాపుండిరి. కావున పాప మా రాజపుత్రి దిక్కుతోఁచక యటునిటు తిరుగుచుండె.

ఇంతలో రాణి కవాటంబు తెఱచి యొకపళ్ళెరంబున రొట్టె యుంచుకొని యటకేఁగుదెంచుచుండెను. అదిగాంచిన శుకంబట శయ్య క్రింద దాఁగుకొనియె. కాకంబులు గవాక్షద్వారమున వెలువడి వెలికింజనియె. పిదప రాణి యటకేతెంచి, రాజపుత్రిం గాంచి నాప్రియమైనబిడ్డా! నీ కోస మీరొట్టె నాచేతులారఁజేసి తెచ్చితి. భుజింపుమనుచు దానినాపెద్రమోలనిడి కవాటబంధనము కావించి చనెను. తోడ్తో నట దాఁగియున్న చిలుక కాకంబుల రాఁబిలిచి యీరొట్టెను ప్రాకారమున కవ్వలితటాకమునఁ బారవేయుఁడు. విషపూరితమిది యనవిని కాకంబు లట్ల కావించెను. పాప మా రాజపుత్రి గడచిన రాత్రియుఁ బవలును గది యందె బంధింపఁబడి యుండెను. తినుటకు తిండి యొకింతయు లేదయ్యె. ఆఁకలిచే నకనక లాడుచుండెను. కావునఁ గాకంబులు తోఁటకేఁగి ఫలంబులు కొన్నిగొనిరా నవ్వాని నారాజపుత్రియుఁ బక్షులును భక్షించెను.

మఱునాఁటి యుదయమందె రాజపుత్రిమరణం బెఱుఁగఁగోరి రాణి యటకేతెంచెను. అట బ్రతికియున్న రాజపుత్రిం గాంచి పాదాహతయైన భుజంగివోలె బుసకొట్టుచు నాపె కేశపాశంబు కేలఁ గీలించి కంఠము నులిమివేయ నుద్యుక్తయయ్యె. ఆ దుష్కృత్యము కాంచిన చిలుక తోడ్తో గవాక్షద్వారమున వెలువడి తిన్నగ రాణి మందిరము చేరి తచ్ఛిశుశెయ్య చెంతనున్న "పరదాకు" నిప్పంటించెను. అంతఁ బోవక నిప్పంటూ

కొన్నది; నిప్పంటుకొన్నదని యఱచుచు రాజపుత్రికడకే తెంచె. అదివిన్న రాణిసేవకులు నోరనోర బాదుకొనుచుఁ బోయి రాణికి విన్నవించిరి. అంత నాపెయు సఫలమనోరథ కాకయే బాలికను భూమిపైఁ బడనెట్టి బిరబిర బిడ్డకడ కేఁగెను.

తోడనె, ద్వారము తెఱచియున్నది. త్వరగ లెమ్ము. ఇప్పుడె తప్పించుకొని పోవలయు నని చిలుక హెచ్చరింప పాప మారాజపుత్రి యుస్సురనుచు లేచెను. పిమ్మటఁ జిలుక వెంటనె పయనమై యుద్యానమునఁ దనరాక నిరీక్షించు కాకంబుల కడకేఁగెను. అటఁ గాకంబులఁగూడి ప్రాకారముకడకేఁగి దాని ద్వార మతిప్రయాసమున వివృతము కావించి యద్దాని ద్వారమున నుద్యానమువెడలి, తిన్నగ సరోవరతీరము చేరెను. అందు రాయంచలు రెండ వ్వలితటమున నడయాడుచుండె. తోడనె రాజపుత్రి తన యంగుళీయకము తీసి, యవ్వానికిఁ జూపి, యటకు రాఁబిలిచెను. అంత నవి యట కరుదెంచి వినయ వినమితగాత్రములై యేమి సెలవనవుడు రాజపుత్రి, నన్నీ తటాకము నవ్వలితటమునకుఁ గొనిపొండని యానతిచ్చె. అంత నా రాయంచలు జంటగా నేర్పడుటయు నాపె తనహస్త ద్వయంబున నా హంసద్వయంబు నంటిపట్టి యీఁదుచు నవ్వలి తటముచేరెను. చిలుక యాపెబాహువు నధిష్ఠించియుఁ గాకము లాకసంబున నెగసియు నవ్వలికిఁ జేరినవి. అంత రాయంచలు సెలవనుచుఁ దమ నెలవుల కేఁగెను.

బాలికయు నీటఁ దడిసినపుట్టంబులఁ ఆఱతినేల నెండ వైచెను. పిదపఁ జిలుక కాకమునొకదాని రాజపుత్రికడ కాపుండుమని రాణిబిడ్డ

యుయ్యేలకడ నిప్పంటించివచ్చితి. పాపమాపెగతి యేమయ్యెనో యెఱిఁగిరమ్మని మఱొకదాని నగరికంపె. రాజపుత్రిపుట్టములు తడిపోవునంతలో నగరికేఁగిన కాకంబట కరుదెంచి యిటులు వచించె:—"అప్పుడె నిప్పు చల్లారినది. రాణిబిడ్డ కేయాపదయుఁ బాటిల్లదు. కాని, రాజపుత్రి విషయఁ మట మందిరమున కల్లోలము కల్గించెను. రాజ్ఞీ నియుక్తులై భృత్యులెల్ల రాపె నన్వేషించుచుండిరి. రాణి కనుఁగొన్నవారి కేఁబది మోహరులు బహూకృతి కావింపఁ బ్రతిన వట్టెను."

అది విన్న చిలుక "అమ్మా ! వసనములు ధరింపుము; మమ్మనుసరింపుము. రాణిపంపున వేగులవాండ్రు వెదక వత్తురు. వారిం గను మొఱంగవలయు." నావిని రాజపుత్రి వసనములు ధరించి చిలుకను వెంబడించెను. కాకంబులు నలువంకలు పరికించుచు ముందొకటియు వెనుక నొకటియు వినువీథి నేఁగుచుండె. అటు లా రాజపుత్రి పక్షులతో పాఱేఁగి యేఁగి యొక యడవి చొచ్చెను. అందొక్కచో జనసమూహము కానవచ్చె. తోడనె రాజపుత్రి వారికెఱుకపడకుండ నొక పొదమాటున దాఁగుకొనెను. జనసమూహ మట దాఁటి చన్నంతనె మఱలఁ బయనమయ్యె.

ఇవ్విధంబునఁ గొంత దవ్వేఁగ రాజపుత్రి కలసట జనించె. ఆఁకలిదప్పు లతిశయిల్లె. అది గుఱుతెఱిఁగి కాకంబొకటి తోడిదానింబిలిచి "రాజపుత్రి యలసినది. నీటితావు లీచేరువ నెటనైనఁ గలవేమో పరికింపుము" నావిని యదియు నొకతరువు నెక్కి

దిక్కులు పరికించివచ్చి దాపుననె చిన్న సెలయేఱొకటి కాన నయ్యెడి నని తిరుగ వచించె.

అది విని చిలుక, వన్యఫలంబులు కొన్నిటిఁ గొని యానీటి చేరువకు విచ్చేయుఁడని యానతిచ్చి రాజపుత్రిం గూడి సెలయేటి చాయకుఁ బయనమయ్యె. అటకేఁగి ఱాతిగుట్టలనుండి నిర్గమించు సెలయేటి సోయగమున కచ్చెరువందుచుఁ గడుపార నీరుద్రావి కాకంబుల రాక కెదురుచూచుచుండె. అంతఁ గొంత తడవునకుఁ గాకంబులు రకమున కొకటిగా ఫలంబులు కొన్ని గొని వచ్చె. పిదప రాజపుత్రి పక్షులు తాను నాఫలములు భక్షించెను. అచ్చోటు నిర్జనంబును వాసయోగ్యంబు నగుటచే నాఁటి రాత్రి యచ్చటనె గడపనెంచెను. సాయంతన మగుడుఁ గాకంబులు మెత్తని పత్రములు తెచ్చి శీతవాతములు సోఁకని తలమున శయ్య నేర్పఱుప నారేయి సుఖనిద్ర సెందె. కాకంబులు నట పరిసర తరువుల నివసించి యపుడప్పు డాపెయునికిఁ గని పెట్టుచు నుండెడివి.

గాజపుత్రి మఱునాఁటి యుదయమందె మేల్కాంచి, కాల్యములు తీర్చి భోజనము కావించి, శుక కాకంబులంగూడి మఱలఁ బయనమయ్యె. అటులు కొంత దవ్వేఁగుసరికి మధ్యాహ్నమయ్యె. అపుడొక మనుష్యుఁడు ముందేఁగు కాకంబునకుఁ గానవయ్యె. అవ్వార్త తోడిదాని కెఱిఁగించు తలంపున కావు కావు మని కూయసాగె. ఆకూఁత రాజపుత్రి వీనులంబడియె. కాని దానిభావ మెఱుకపడదయ్యె. అంత రాజపుత్రి యటుకూయుచు దనకై యేతెంచుఁ గాకముంగాంచి యేదేని

భయకారణము కానోపునని చెంతనున్న పొద చాటున దాఁగు కొనెను. అట కేతెంచిన మనుష్యుఁడు కొంతదవ్వు చన్నంతనె యథారీతిఁ గాకంబుల కడకరిగె. కాని వాని యాలాపంబు లెఱుఁగ రావయ్యె. తోఁట్తోనాపె కారణ మేమా? యని యంగుళింజూడ నుంగరము కానరాదు. అంత నేడ్చుచు నుంగరపుఁ బోక కాకంబుల కెఱిఁగించు తలంపునఁ జేయెత్తి చూపెట్టెను. అది యెఱింగిన శుకంబు శోకించె. కాకంబులు కావుకావుమని కార్ప ణ్యము వెలిఁబుచ్చెను. బాలికయు నేడుపున జాలు గరఁగించె.

పిమ్మటఁ జిలుక, మము వెంబడింపు మను భావము తోఁప శిరమాడించుచుఁ గాకంబులంగూడి పయనంబు మఱలించె. బాలికయు వాని వెంబడించెను. ఉంగరమును వేయికన్నుల వెద కుచు వచ్చినత్రోవఁ బట్టి నాఁటి ప్రత్యూషమునఁ బయనమైన చోటి కేతెంచి చూడ రిత్తకు-రిత్త. ఎటవెదకినను గానరాదు. అంత సాయంతనమగుడు రాజపుత్రి రాత్రిభోజన మాచరించి చన్న రేయిఁ బరున్న శయ్యనే పవ్వళించెను. పవ్వళించి అయ్యో! నాయనుంగుఁబక్షుల ప్రసంగంబు లెఱుంగరావయ్యెనే! యింక దిక్కెవరు? అనుచు కన్నీరు మున్నీరుగ నేడ్చుచునే నిద్రించెను.

మఱునాఁటి జేపకడ మేల్కాంచి పక్షులంగూడి యుంగర మన్వేషించుచు నేఁగుచుండె. అటఁ జెట్టుక్రింద నిద్రించు నొక "సిఫాయి" కాకంబులకుఁ గానవయ్యె. అందొ క్కటి తోడిదానిం బిలిచి యిట నొక "సిఫాయి" నిద్రించు చున్నాఁడు. రాజపుత్రినిఁ గాచి యుండుమని హెచ్చరించె. ఇది

విన్న యాతఁడు మేల్కాంచి యెవరా వెళ్లువారనుచు లేచి నిలువఁబడెను.

అప్పు డాతని యంగుళినున్న యుంగరము కాకంబులకుఁ గానవచ్చె. కావునఁ గాకంబు లాతని ప్రశ్నమును బ్రత్యుత్తరింపక తప్పదయ్యె. పిదపఁ గాకంబులు-మే మభాగ్యములగు కాకులము. మఱియు మీకు దాసులము-అని వచింప నాతీరు మాటల కాతఁ డద్భుతమంది మీరు పక్షివంశమున జనించితిరికదా? ఈ తీరు మాటలాడు చంద మెటులలవడియె నని ప్రశ్నించె.

కాకంబులు——అయ్యా ! మీయంగుళి నొకమాంత్రి కాంగుళీయకము కలదు. దాని ప్రభావమిది. కావున మీయడుగు దానికి బలవంతముగ నైన బదులు చెప్పక తప్పదు.

సిపాయి——ఆఁ! బాగున్నది; అగుచో మీచేయు ప్రసంగ మేరాజపుత్రిని గుఱించి?

కాకంబులు——కాశ్మీర రాజపుత్రిని.

సిపాయి:——ఆఁ బాగు; బాగు! ఈమెను బట్టి యిచ్చిన వారికె కదా? రాణిగా రేఁబది మోహరులు బహూకృతి నిత్తు మని ప్రతినకావించినది. ఆడఁబోయిన తీర్థమెదురైనది. కలసివచ్చు టన నిట్లుండవలె! ననిన యాతని యానందమున కవధి లేదయ్యె.

పాపము ! కాకము లా రాజపుత్రిని పగతుచేతఁ బెట్ట వలసినే యని మిగుల వగచెను. కాని యంగుళీయ ప్రభావ మట్టిది. దాని వశము కాకతప్పదు. కావునఁ గాకము లా రాజ పుత్రి యునికి నెఱిఁగింప నా నిర్దయుఁడు, రాజపుత్రి యేడ్చినను బ్రతిమాలినను మఱితప్పినను వీడక యీడ్చుకొని పోసాగె.

అంతఁ గాకంబులు కర్తవ్యతామాఢ్యమున శూన్యహృదయములై కావు కావు మనుచు నా యపరకాలుని వెన్నంటి యేఁగుచుండెను. అంత నాతఁడు సరసీతటము చేరి రాజపుత్రి నందున్న నావపైఁ గూర్చుండఁజేసి నడపుచుండెను. చిలుక యందొక చెక్కచాటున దాఁగి యవ్వలికిం జేరి తోడనే తెంచిన కాకములంగూడి మందిరోద్యానమున గవాక్షము కడ వేచియుండెను. ఇంతలో రాణిభృత్యుఁడు మందిర ద్వారంబు తెఱచె. తోడనే రాజపుత్రిని వెంటనిడుకొని "సిఫాయి" యింటఁజొచ్చెను. అంత రాణిభృత్యు డాపెంజూచి పండ్లు పటపటఁ గొఱుకుచు క్రూరదృష్టులఁబఱపుచు రమ్మ్న రాణి కడ కనుచు నీడ్చుకొనిపోయె.

రాణి "సిఫాయి"కిఁ దన ప్రతిన చెల్లించెను. పిదప బాలికం జూచి పాపినీ! పాపీ చిరాయువన్నటులు నీకెంత బ్రతుకయ్యెనే? చావు కెదురీఁదుచుంటివే మే? యని యీసడించుకొనుచు భృత్యునింగాంచి యోరీ! మఱలఁబోయి చావకుండ దీని నా గదియందు బంధింపుము. ద్వారముకడను గవాక్షములకడను గావలి వారలఁ గాపుంచుమని యానతిచ్చి సిఫాయింజూచి యేదీ! బాలిక నెటఁబట్టుకొంటివి. ఎట్లుచిక్కె? సాంత మెఱిఁగింపు మని ప్రశ్నించె. దాని కాతఁడు తనకొక యడవియందుంగరము చిక్కుటయు - అది కారణముగ కాకవాగ్గ్రహణ శక్తి కలుగుటయుఁ బిదప రాజపుత్రి చిక్కినచందమును వివరించి విన్నవించి యుంగర మాపె కందఁజేసి యింటికరిగె.



# మూఁడవ ప్రకరణము

"పూర్వము స్వామి గోరఖ్ నాథుఁడను వానికడ గారడీ యుంగర మొండుండెడిది. ఆతఁ డద్దానిమహిమచే జంతుజాలము నెల్లఁ గనుసన్నల మెలపుచు నవ్వానిపైఁ దన ప్రభుత సాగించుచుండెడి వాఁడు. ఆతఁడు మరణింప జంతువు లన్నియు నిఁకనైన మఱొకని దాస్యమునుండి తలఁగుద మని యుంగరము నెచ్చటనో దాఁచి యుంచెను."—అను వార్త రాణి తన చిన్ననాఁడె కర్ణాకర్ణికగ వినియుండెను. అట్టి యుంగర మిప్పు డాపె కప్రయత్న లబ్ధమగుటచేఁ బరమానంద భరితయయ్యె.

పిదపఁ దత్కథాపరిచితి గలిగి కాలవశమున రాణికిఁ జిక్కి యుద్విగ్నచిత్తములై యుద్యానమున తరుశాఖను విశ్రమించిన కాకములం గాంచి యుంగరము చూపి రాఁ బిలిచె. తోడ్తోనవి యట కరుదెంచి 'యేమి సెలవ'ని తలలొగ్గి నిలిచెను. అంత రాణి తటాకమున కవ్వలితటమున కాననంబొండు కాన నగును. అందు పృథుశిలాతల మొకటి చతుష్కోణములు తీరి యుండు. తదుపరిభాగమున దాడిమవృక్ష మొండుకలదు. దాని ప్రకాండమున మండూకము కట్టఁబడియుండు. దాని పండొకటి నాకై కొనితెండు. దాని గింజలు తిన్నవారెట్టి విషప్రయోగమునకైన నగ్గము కారు. కావున మీరును గొన్ని గింజల భక్షింపుఁడు. అవి భక్షింపరేని మీరు కావింపనున్న కార్యము సాగింపఁజాలరు. ఎద్దియందురా? ఆ యడవినె పర్వతశిఖర మొక

దానిపై విషవృక్ష మొుండుకలదు. దానిజిగురు మీా రిటకుఁ గొని రావలయు. ఆ చెట్టుగాలి సోఁకిన మాత్రమున మరణము పాలై పోదురు. జాగ్రత్త సుమా! యని సత్వర మట వెడలించె.

కాకంబులును తత్క్షణ మటకరిగి దాడిమవృక్షము చేరి దాని ప్రకాండమలింపగ మండూక నినాదము విననయ్యె. అదియె గుఱుతుగాఁ గొని దానిక్రింద రాలియున్న గింజల భక్షించి ఫలంబుల రెండిటిఁ గైకొని పర్వతశిఖరంబుననున్న విషవృక్షము కడకేగెను. అచట పచ్చిపూరి సైతము కానుపింపదు. చూత మన్న నొక్క ప్రాణియుఁ జూపట్టదు. కాని తద్విషవృక్ష వాయు ప్రసారమునఁ గాఁబోలు! చచ్చిన పక్షులయు జంతువులయు, జీర్ణ విశీర్ణములైన యస్థిపంజరముల నడుగిడ వీలుగాకుండె. పిదప నవి దానిజిగురు గైకొని వచ్చినదారిని బయనమయ్యె. అంతఁ గొంత తడవునకు మందిరాంతికమునకు విచ్చేసి పండొక దానినట పొదచాటునఁ బారవైచి జిగురుతో పాటు రెండవదానిని రాణి కర్పించెను. అంత నాపెయు, తానును భృత్యుఁడును గొన్ని గింజల భక్షించి జిగురు నొక బరిణయందుఁ బదిల పఱచెను. పిమ్మటఁ గాకంబులు నాపెను వీడ్కొని రాజపుత్రి యున్న గదియందలి గవాక్షము కడ కరిగి చిలుకతోఁ దమ పోయిన పని యంతయు వరుసగ వివరించి చెప్పె. అది విని చిలుక యిది రాజపుత్రిని గడ తేర్పఁజేయు మఱొక పన్నుగడ కాఁబోలు నని తదపాయనివారణార్థ ముపాయమాలోచించు తఱిఁ గాకంబులు-ఆఁ! మఱచితిమి; మఱచితి మనుచు రివురివ్వున నేఁగి పొదమాటున దాఁచి వచ్చిన దానిమ్మపండు తెచ్చి చిలుక

కందఁజేసె. చిలుకయు దానఁ గొంత తాను భుజించి తక్కుం గలదానిఁ గైకొని రాజపుత్రి కడకరిగె.

అట పండు నామె మ్రోలనుంచి దీని భక్షింపుమను భావము తోఁప నుత్తమాంగ మాడింపసాగె. కాని దాని చర్మము మండూకచర్మముఁ బోలియుంట రాజపుత్రి కద్దాని భక్షింప మనసొప్పదయ్యె. అంతఁజిలుక యెన్నెని కనుసన్నలు చేసియు మాటిమాటికి దానిఁబొడిచియు నీతీరు ప్రయత్నములచే నొండు రెండు గింజలు తినుపించుసరికి తాతలు దగ్గఱైరి.

ఇంతలో కిరకిర మను కవాటపు ధ్వని వినవయ్యె. అది విన్న శుకంబు మిగిలిన పండు నటఁబాన్పు క్రిందఁ బదిలపఱచి తానునట దాఁగుకొనెను. అంతఁగొంత సేపటికి రాణి సేవకుఁడు పళ్ళెరమున రొట్టెయు పానపాత్రమునఁ బానీయమునుంచుకొని వచ్చి రాజపుత్రిమ్రోలనిడి తిరిగిచనెను. రాజపుత్రి మిక్కిలి యాఁకొని యుండెను. కాని యవి భక్షించుచో నేమి కీడుమూడునో యని కొంకుచుండె. అంతలోఁజిలుక యట కేతెంచి దాడిమఫల ప్రభావమున నవ్విషపుగుణమంటదని తెలిసినదై యది తిన్నను బ్రమాదము రాదను విషయము తెలుపఁ బ్రయత్నించి ముక్కుతో రొట్టెను మఱలమఱలఁగొట్టియు, పలుమాఱు నీరు ద్రావియు, దానిఁజూపుచు మాటిమాటి కఱచియు నీతీరు సంజ్ఞలెన్నియొ చేసెను. తుదకది తెలిసిన రాజపుత్రి రొట్టెను దిని నీరు ద్రావెను.

ఇంతలోఁ గాకంబు లట కంగుళీయకము తెచ్చి బాలిక మ్రోల నునిచె. రాజపుత్రి యది ధరించినంతనె కాకాలాపము

అవలీలగ గ్రహింపఁ గలిగెను. పిమ్మటఁ గాకంబులు తమా కంగుళీయకము చిక్కినచంద మిట్టులు వచించె. "రాణీ-భృత్యుఁడు లోనికేతెంచు తఱి గవాక్షద్వారమున వెలువడి తిన్నగ రాణీమందిరము కడ కరిగితిమి. అట నాపెశయన మందిరమందలి గవాక్షమున కెదురుగనున్న తరుశాఖను గూరు చుంటిమి. రాణియు, తనగదిలో బిడ్డతో నాటపాటలఁ గాలము గడుపుచుండె. అప్పుడా బిడ్డ యమ్మయంగుళినున్న యుంగరము లాగి గవాక్షద్వారమున వీథిలోనికి విసరివైచెను. అంత నా యుంగరము దొర్లుచు వీథినడుమఁ బడెను. రాణియు దానిఁగొనిరా నాకరిని నియోగింప లోనికరిగెను. తోడ్తోమేమది గైకొని యిట కరుదెంచితిమి." నావిని రాజపుత్రి-అన్నా! నా యనుంగుఁ జుట్టాల మాటల నిప్పుడు గదా! యెఱుఁగఁగల్గితి" ననియొంతయు ముదమందె. మఱియు నాజిగురుయొక్క గుణవిశేషమును తత్ప్రతీకార ప్రభావము గల దాడిమఫలమహత్త్వమును సాంత మెఱింగి బీతువిడిచి రొట్టెను తృప్తిదీర భుజించి పాన్పునఁ బవ్వళించె.

మఱునాఁటి ప్రత్యూషమందె రాణిసేవకుఁడు రాజపుత్రిమరణ మెఱుఁగఁగోరి యట కరుదెంచెను. అటనాపె సజీవ యగుటకాంచి తెల్లవోయిన మోముతోఁ బెదవి గదల్పకయె రాణికడ కరిగి కలరూపెఱింగించెను. ఇటఁ జిలుక కాకమొక దానింగని, వేగిరము రాణికడకేఁగుము; వారి సంభాషణక్రమ మాలకింపుము—అనఁ గాక మటకేఁగి పొదమాటున దాఁగి యుండి వినఁదొడంగెను. పిదప రాణి రాజపుత్రిచందము సాంత

మూలకించి యీపెకడ నెదిర్చియో గారడి యుండనోపు; కాకున్న విషమిచ్చినను జావదేల ? అయినను జాలిపడు; నేఁటిరేయి నాపెను దోడ్కొని మందిరోపరిభాగమున కేఁగుము. కంఠమున నొక ఱాతిబండను గట్టి సూటిగఁ దటాకమునఁ బడఁద్రోయుము. దాన నీటమునిఁగి యసువులఁ గోలుపోవును. మఱునాఁటి ప్రభాతముననె బాలిక మరణించినదని యొక కపటశవము కల్పించి సరస్సునఁ బడఁ ద్రోయుద మని యానతిచ్చె. అంతకుమున్నటఁ బొంచియున్న కాకియు నీ రాణిచెడుతలంపు చెవులఁ బడ్డంతనె తోడ్తో నేతెంచి తోడిదాని కాపన్నగడయంతయు వివరించి చెప్పెను.

మందిరప్రాకారమున కవ్వలఁ దటాకమున కవ్వలితటంబున నొక కుటీరము కలదు. అందొక వృద్ధుండగు జాలరి వసించుచుండె. అతని జాలమెల్లపుడు రాణిమందిరము క్రింది భాగమున సరస్సులో మత్స్యములకై పన్నియుండును. రాజపుత్రి చెలికత్తెలంగూడి మందిరము నెక్కి, జాలరి చేఁపలు పట్టుచుండ వినోదము కాంచుచుండెడిది. అపుడపుడు మత్స్యముల విలిచి త్రాడుచే బంధించి మీఁదికి లాగుకొనియు, వాని విలువ నటులె చెల్లించియు నీతీరుగ ధీవరునితోఁ గొంత పరిచితి గలదయ్యె. చిలుకయు మత్స్యమాంసభక్షణ మతి ప్రియము కావున తఱచు జాలరితోఁ గలియు చుండెడిది.

ఈ తీరు పరిచయము కారణముగ పక్షిగణ మావృద్ధుని సమీపించి బాబూ ! భవదనురాగ పాత్రమగు రాజపుత్రికి నేఁడు కీడు మూఁడనున్నది. దాని రక్షింప మీసాయమవసరము.

నావిని వృద్ధుఁ డపరిమితానందభరితుఁడై "రాజపుత్రిని రక్షింపనగు కార్యంబు కలుగుచో నిప్పుడె సంసిద్ధుఁడను. నీట మునుఁగుమన్న మునుఁగుదు. అగ్గి చొఱుమన్నఁ జొత్తు. పెక్కుమాటలేల? ఆపె గుఱించి నా ప్రాణంబు సైతము తృణంబుగఁ దలంతు" ననుచుఁ జిలుక యానతి తలఁదాల్చి తత్ క్షణమాచరింపఁ బ్రతినవట్టె. పిదప నప్పక్షిగణంబును కలతెఱంగెఱిఁగించి వృద్ధునితో నాపె రక్షింప కార్యసాధకంబు నిరపాయంబునగు నుపాయమాలోచించుతఱి వృద్ధుఁడట్టె స్ఫురితిగన్నవాఁడువోలె కాకములం గాంచి నేనొక్క యుపాయము చెప్పెద నాలకింపుఁడు. "మందిరోపరిభాగమునకు సూటిగ నీట నొక జాలము పన్నియుంతము. అగుచో పైనుండి త్రోయఁబడు రాజపుత్రి జాలంబుననే పడియుండు. మఱొక్కటి; మాయింట జీర్ణమగు జాలంబొకటి కలదు. అద్దాని బెండ్ల నూడఁబెఱికి చిలుక మూలమున రాజపుత్రికడ కంపుఁడు. అట వానిని ఖండఖండములుగఁ గావించి తనకోస మొక 'చొక్కా' నేర్పఱచు కొమ్మనుఁడు. దాని నొరులెఱుఁగకుండ లో ధరింపుమనుఁడు. అగుచో నామె నీట మునుఁగకుండును.

అదిగాక దుర్మతియగురాణి యాపెకంఠమున నురిఱాతిని బంధింప నానతిచ్చెఁగదా! దానిఁ దప్పించుకొనుట కుపాయముగా - పదనుగలకత్తి నొకదానిఁ జిలుకచేత నట కంపుఁడు, అద్దానిని 'చొక్కా' ముం జేతను బదిలపఱచి దానిచే నురి ఱాతిని తొలఁగించుకొమ్మనియుఁ జెప్పుఁడు" అని వివరించిచెప్పె. చిలుక కొంతతడవున కుంగరము తోఁబాటు బెండుముక్కలు గైకొని

రాజపుత్రికడకుఁ బయనమయ్యె. కాకంబులును తమ యోపిన కొలంది పరికరములు స్వీకరించి కీరమును వెంబడించెను. ఈ తీరుగ నప్పక్షిగణంబు రాజపుత్రికడ కేఁగి రానున్న యాపదను, తదాపన్నివారకమగు నుపాయము నెఱిఁగించి రెండు ముక్కలందీయ నామె యవ్వానిని ఖండఖండములు గావించి దిట్టమగు దారమున గ్రుచ్చి ధరించెను.

సాయంసమయ మయ్యె. లోకబాంధవుఁ డస్తాద్రిని విశ్రమించెను. గాఢాంధకారము గ్రమ్ముకొనెను. అంత రాణి-సేవకుఁడు రాజపుత్రికడ కరిగి కిమ్మనకయె చేయిపట్టుకొని యుద్యాన వనమున నీడ్చుకొనుచు మందిరోపరిభాగమునకుఁ జనియె. అట నుద్యానమునఁ గైకొన్న ఱాతిబండ నాపె కంఠమున దిట్టముగఁ గట్టి తటాలునఁ దటాకమునఁ బడఁద్రోసె. అది తడవుగ నామె చాకుతో నురిత్రాటిని గత్తిరించెను. అంత నది తటాలున నీటఁబడి బుడుంగుమని మునింగెను. కాని రాజపుత్రి, జాలరి పన్నిన జాలము సాయమునను దాఁ బన్నుకొన్న చొక్కా సాయమునను నీటిపైఁ దేలియుండెను. అంత నా దుర్మతి చిమ్మచీఁకటిలో నాపె పొడగనలేక తోడనె రాణి కడ కేఁగి తన దుర్ణయంబును వరుసగ వివరించెను.

అంతకు మున్నట డాఁగియున్న జాలరి రాజపుత్రి నీటఁబడ్డ ధ్వని చెవులఁబడ్డంతనె వలను దనవలనుకు లాగుకొనియె. అంత నందీఁదుచు నేతెంచురాకన్నియను దన పడవపైఁగూర్చుండఁ జేసి నిశ్శబ్దముగ నవ్వలితటము చేర్చెను. పిదప రాజపుత్రి జాలరితో నాతని కుటీరంబుచేరి తన తడిసిన వసనముల నెండ

వైచికొనియె. కాకంబులును మందిరమునిరాఁదినుండి త్రోయఁ బడ్డ రాజపుత్రి పడవనెక్కినంతన ధీవరునికుటీరము చేరి యామెరాక నిరీక్షించుచు నామెనుగాంచి యానందాంబుధి నోలలాడినవి. పిమ్మట రాజపుత్రి, జాలరి తనకై తెచ్చిన యాహా రంబునఁ గొంత కాకంబులకును మఱికొంత శుకంబునకు నిడి తాఁగొంతయు భుజించి సుఖశయ్యను శయనించెను.



# నాల్గవ ప్రకరణము.

'కాలము ప్రతికూలము. కడుజాగ్రత్తగ మెలఁగ వలయు. గడప దాఁటి యవ్వాలకొక్క యడుగైనఁ గదపరాదు. ఇతరు లెఱింగి రేని రాణి కెఱుకపడుతురు. కోరిక పొడమెనేని తోఁటలో నాడుకొనుచుందుము, - అని బాలిక నింట భద్ర పఱచి జాలరి ప్రత్యూషముననే చేఁపలఁ బట్టితెచ్చుటకై సరసి కేఁగెను. కాకంబులు నగరవార్తఁ దెలిసి రా నగరికరిగె. అట రాజపుత్రి మరణవార్త నగరమునలువంకల నలము కొనెను. నగరమంతయు మూర్తీభవించిన శోక మోయనఁ గానన య్యె. పాపము! తల్లిలేని పిల్ల కెన్ని పాట్లయ్యెనే! యని యంగలార్చువారును, సవతితల్లి చాటుపిల్లకు చావు తప్పునే యని సణుగువారును; రాణి మిక్కిలి గడుసుదఁటే యని చెవులు కొఱుకుకొనువారును; అమ్మా! ఊఱకుండవే! పెదవి దాఁటిన పెన్నదాఁటు నని కసరుకొనువారునై నగరమునఁగల నారీలోకము గుసగుసలు సాగించిరి.

రాణి రాజపుత్రికపటశవ మొకటి కల్పించి నాఁటియా చారము ననుసరించి నదీప్రవాహమున వదలుటకై యత్నములు సలుపుచుండెను.

అదికాంచిన కాకంబు ముదంబు ముప్పిరిఁ గొనఁ గుటీ రము చొచ్చి 'బిడ్డా! నీ మరణంబు నిక్కువంబని రాణి యుమ్మలిక పీడినది. ఇఁక నీ మాతామహునికడ కేఁగునందాఁక నిచ్చటనె కాలము గడపవచ్చును. జాలరి మన కెంతయుఁ దూర్చువాఁడు.

మిగుల దయాళుఁడుకూడ." అనునంతలో నాతండు చేపలఁ బుట్ట వీపుననిడుకొని విచ్చేసి యొండు రెండు వాలుగల రాజపుత్రి కొఱకు నింటదాఁచి తక్కుంగలవాని విక్రయించువాఁడై నగరమున కేఁగెను. అట మత్స్యముల విక్రయించిన మొత్తము వెచ్చించి రాజపుత్రికి వలయు కట్టుపుట్టంబులును గృహోపకరణంబులును విలిచి తెచ్చెను.

రాజపుత్రి యల్లిక-కుట్టు మున్నగు చేతిపనులలో నందె వేసినచేయి. కావున నితరులు తన్నుగుఱుతింపకుంటకై పేదలు ధరించునట్టి దుస్తులను గుట్టికొని ధరించెను. మఱియు గుమ్మము గూడ దాఁటక యెకోరికవోడమెనేని కుటీరంబు వెనుక తోఁటలో నాడుచుఁబాడుచుఁ గాలము పుచ్చుచుండెడిది. ఇంటి పనులు సవరించుటయు జాలములు జీర్ణములగుడు బాగుపఱచుటయు శుక కాకములతోఁ బ్రియభాషణము సలుపుటయు నాపె నిత్య కృత్యములు.

జాలరి దినదినము మెఱికలవంటి మత్స్యములఁ బట్టితెచ్చి, పట్టణంబున విక్రయించి వలయు వస్తువులఁ గొని తెచ్చువాఁడు. ఈతీరుగ దినములు కొన్ని దిగులువోగులు లేకయె గడచినవి. కాని కాలక్రమమున వర్షములు కఱవుగా వాగులు తక్కువయ్యె. మత్స్యములు దొరకమిచే వ్యాపారము మందగించె. అదిగాక ఋతుపరివర్తనము కారణముగ వన్యఫలంబులు వట్టిపోయెను. కావున నిల్లుగడచుటయే కడుదుర్లభమయ్యె. ఒకనాఁడు మత్స్యములకేఁగిన జాలరి రిత్తచేతుల నింటికిఁ దిరిగి వచ్చెను. నాఁడు ఇంటనొక రొట్టెముక్కతక్క గ్రాసంబునకొక కాసైనఁగానరాదు.

అంత గతిగానకా యిర్వురారొట్టెను భుజించుచుండ కావుకావు మనుచుఁ గాకంబులు రెండట కరుదెంచి మోహరుల రెండిటి ముసలివాని మ్రోలఁబెట్టి రాజపుత్రితో నిటుల వచించె. "మందిరోద్యానమున ఫలాన్వేషణకై యటునిటు తిరుగాడి యాడి విసివి వేసారితిమి; కాని ఫలం బొక్కటియుఁ గానరాదయ్యె. అంత నెక్క కదలింపను శక్తిచాలక యందొక పురాతన యంత్రశాలపై పొగపోవు గొట్టమునఁ గూరుచుంటిమి. పిదప నుబుసుపోవక తద్ధూమనిర్గమసాధన విశాలరంధ్రంబు దిక్కు వంగి చూతుముగదా! అందేదియో తళతళమను కాంతుల నీను తేజఃపుంజము మాకంటఁ బడెను. అదేమా! యని యందుఱికితిమి. నగలు, నాణెములు, రత్నములు, మోహరులయు రాశి యటఁగలదు. అందు రెండిటి మాచంచుపుటంబులఁ గఱచిపట్టి యిటకే తెంచితిమి." అంత నావృద్ధుఁడు పెన్నిధిఁగన్న పేదవోలెఁ బరమానందభరితుఁడై "ఇది రాజధనము; కావున రాజపుత్రిదియుఁ గావచ్చు. అగుట దీనిఁదెచ్చిన మన కేదోసముంటదు. రాజు తన తనూజకు ధనమవరమని యెఱిఁగెనేనిఁ నెంతేనిఁ బంపఁగలాఁడు" అనుచు నవి గైకొని పణ్యవీథి కేఁగి వలయు వస్తువుల విలిచితెచ్చెను. ఇటులె యవసరమగు నపుడెల్ల కాకంబు లటనుండి మోహరులు కొనిరా నవ్వానితో వలయు వస్తువులఁ దెచ్చుచు సుఖజీవనము సేయుచుండెను.

కాల మొక్క తీరుగఁ గడవఁబోదు. ఆపన్నులనే యాపద లంటివచ్చును. ఒకనాఁడు రాజపుత్రి తోఁటలో నొంటరిగ నాడుకొనుచుండె. అంత నొక యెఱుకత గోడ కవ్వల

తుండి - అమ్మా ! బిచ్చము పెట్టుము. ఆఁకొనియున్నదాన. చచ్చుటకు సిద్ధమైతిని. కొంచె మోగిర మిడుము. పున్నెముం డును—అని బాలికంగని సవినయముగ నమస్కరించి దీనముగ దేవురించెను. అంత నయ్యమాయిక చెరచెర లోనికింజని రొట్టె నొకటి తెచ్చి గోడపైఁగ నామెకిడఁబోవ నాదుర్మతి యొక వస నము బాలిక మోమునఁ గప్పి కిమ్మనకుండ తనవైపీడ్చుకొనియె. కొని యొక సంచిలోఁ జుట్టఁగఁ జుట్టి వీపున మోపుకొని యఱచితివా! కుత్తుక నొక్కెదనని బెదరించుచుఁ జనుచుండె. పాపమా బాలిక యూపిరి సలుపక బిట్టు వగచుచుండెను.

అదియొక కాఱడవి. పట కుటీరము లొండురెండు తెల తెల్లగఁ గానఁబడుచుండె. తన్నికటముననె కొంద ఱగ్నిదేవుని కట్టెలతోఁ బురికొల్పుచుండిరి. రాసభము లొండ్ర పెట్టుచు నటనట నడయాడుచుండె. పద్మబాంధవుఁడు మింటినడుమను వెలుఁగుచుండెను. అప్పుడొక యెఱుకత కుటీరముల కడ కేతెంచి మూఁపుననున్న మూటదింపి యొక్కతీరుగ విలపించు బాలికను వెలికిఁదీసెను. పిదప నామెను జూచి-అమ్మా! యేడువకుము; నిన్నొక పట్టణమునకుఁ గొనిపోదుము. అటనొక ధనవంతున కమ్మెదము. అట నీవెంతయు సుఖమొందఁగలవు. కాని యిటనుండి పరుగిడఁ బ్రయత్నించినను—ఇతరసహాయ ముకోరి విలపించినను, నీ ప్రాణంబుపై వచ్చుసుమా ? యని చెప్పునంతలోఁ దక్కుంగలవారందఱు పటకుటీరములు పెకలించి రాసభములవీపున మోపి పయనము సాగించిరి. రాజపుత్రియు నొక రాసభము నెక్కి రూపెత్తిన శోకమోయన వారి వెన్నంటి

యేఁగుచుండెను. అటు తేఁగుచుఁ గాకంబు లెట్టైనఁ గన్పట్టునో యని నలువంకలు పరికించుచుండె. కాని వాని జాడయుఁ గానరాదు. మఱియుఁ దన యుంగర మారెూఱుక లెఱింగి లేని నపహారింతురన్న భయంబున కేశపాశమునఁ బదిలపఱచెను. ఎఱుక లివ్విధంబుగఁ గొంత దవ్వేఁగు సరికి సాయంతనమయ్యె. కావున రాకపోకల రాపిడి లేనిచోటఁ గుటీరము లేర్పఱచి రాత్రిభోజన మటఁ గావించిరి. బాలికయు భోజన మాచరించి యందొక కుటీరమున నిద్రించెను.

రాజపుత్రి మఱునాఁటి వేకువనె మేలుకాంచెను. ఎఱుక లందఱు గాఢనిద్రలో మునిఁగియుండిరి. కుటీరద్వారము వివృతంబైయుండె. ఆకైనఁ గదలినజాడ గానరాదు. అంత నాపె మెల్లఁగ ద్వారము చేరువకుం జేరి పరుగెత్తుదునా! యని తలంచు నంతలో నటకు దాపుననున్న శునకమొకటి బౌ బౌ యని మొఱుఁగసాగెను. ముందునకు సాగ నది యడ్డగించె.

పిమ్మట రాజపుత్రి "యిపుడు పరుగిడితినా; యిది మొఱుఁగుచు నను వెంబడించును. అంత నెఱుకలు మేలు కొందురు. నా యత్నము సఫలముకాదు. పైపెచ్చు ఎఱుకలు నాపై కఱకులు కావింపకపోరు. కావున నిప్పుడు చనరాదు" అని తలంచి యచ్చటనె నిలిచియుండెను. కుక్కయు నాపెను గన్నార్పకయె కాంచుచుండె. పిమ్మట నటకుఁ జేరువనె తరుశాఖనున్న కపోతంబురుత మామెకు వినవచ్చె. తలయెత్తి పరికింపఁ గపోతంబు కానఁబడెను. తోడనే యుంగరము చూపి చేసన్న చేరాఁ బిలిచెను. అదియు నప్పుడె వృక్షంబు డిగ్గి యామె చేతిపై

వ్రాలెను. అంత రాజపుత్రి మందస్వరమున దానికెద్దియో నివే దించి కేశపాశమొకదానినిచ్చి వెంటనె వెడలించె. పిమ్మటఁదన శయ్యకేగి శయనించెను.

తూరుపు తెల్లవారినది. తోడనె యెఱుకలందఱు మేలు కాంచి సామగ్రినంతయు రాసభముల వీపున మోపి పయనము సాగించిరి. రాజపుత్రియు నడవఁగల్గుచో నెఱుకబాలురఁగూడి నడచుచు నలసినచో రాసభములపై విశ్రమించుచు నేగు చుండె. అప్పు డప్పు డన్యెఱుకత తన్నుఁజేరి "మనము లాహోరు చేరెదము. తన్నగరాధీశునకు నిన్నమ్మెదము. అట నీ వెంతయు సుఖమందఁ గలవు—అను చుండెడిది. ఎఱుక లీతీరుగ నాఁకొన్నతఱి భుజించుచు నలసినచో విశ్రమిం చుచు, నెండవేళల నీడ నాఁగుచుఁ బవలంతయు నడచి నడచి ప్రొద్దుగ్రుంకు నంత నొక యడవిఁ జొచ్చిరి. సామగ్రి నట దింపి కుటీరముల నేర్పఱచి రాత్రి 'బస' నేర్పాటు కావించిరి. ఎఱుకతయానతిఁగొని రాజపుత్రి చల్లనిగాలి కటునిటు విహ రించు చుండెను. ఎఱుకత, కావలిగా నియోగింప నొక్క శునక మాపెను వేయికన్నులఁ గనిపట్టుచు నటునిటు చనుచో నదలించుచు త్వరగ నడచుచో మొఱుఁగుచుఁ దనవిధి తా గుఱితించి మెలఁగు చుండెను.

ఒకనాఁటి సాయంతనమున జాలరి కుటీరమునఁ గూరు చుండి స్వీయదుఃఖమయ జీవితమును దూలనాడుకొనుచు— కటకటా! కావించిన ప్రయత్నములన్నియు మంటిపాలయ్యెనే! ఎట కేఁగెనో? ఎందుండెనో? ఏ వెతల పాలయ్యెనో?

భూమిపై నుండెనో; లేదో? చుట్టు పట్టుల నెప్పట్టున నెమకి నను గానరాదే? ఏమి చేయఁగలారము. ఎందేగఁగలము. చెనఁటి ధాత చేఁత లతివిచిత్రములు. తలఁచినదాని నన్యథాకరింప నాతనికిఁ బెట్టినది పేరు. కష్టములు తలఁగి గట్టెక్కితి మను కొంటిమే; ఇంతలోఁ గట్టడిదైవ మీచెట్ట నేల చేకూర్పవలసె. ఒకవేళ తానె సాహసించి తాత కడకేఁగియుండునా? కాదు; కాదు—ఆఁకటిప్రొద్దెఱుంగని యమాయిక యట్టి సాహసము తలపెట్టునా? కాక-ఇట నీపె యునికి నెఱిఁగి రాణిపన్నిన పన్ను గడమై యుండునా? ఆ పాపురాలిచేతఁ బడిన రాజపుత్రికిఁక జీవితాశ కూడనా? యని పలువిధములఁ బలవించుచుఁ గంటికి మంటికి నేకధారగా నేడ్చుచుండె. శుక కాకంబులు నచ్చటనె శోక మూరూపము తాల్చెనో యనఁ గూరుచుండెను.

అంత నొక కపోతము రివురివ్వున నెగయుచు నేతెంచి కేశ పాశంబొకటి నటడించి యన్నలారా! బాలికకుఁ గుశలమె. ఎఱుకల యధీనమందున్నది. వారొక యరణ్యమున విడిసి యుండిరి. ఱేపో మాపో పయనమై లాహోరు పోఁబోవుదురఁట. మిమ్ము వేగిరము రండనినది. ఇది మీకెఱిఁగింప నా సాయము కోరినది. తోడ్తో నేనిట కరుదెంచితి. గుఱుతుగా నీ కేశపాశము మీకిమ్మన్నది. ఇదిగో! అనుచుఁ గాకముల వీడ్కొని టపటప కొట్టుకొనుచు నంబరవీథి కెగసె. అంత నవ్వాయసంబులు రాజపుత్రి నన్వేషింప నిప్పుడె యేఁగుదు మనుచు వృద్ధునివీడుకొని తా మొక కఱ్ఱను జంచుపుటంబులఁ గఱచిపట్టి, చిలుకయు తన్మధ్యభాగ

యును మున్ను తోఁగలచిపట్టితెయు పక్షంబులయుఁ గొంతసేపయ యునఁ దమతో నెగురఁగ గగనమున కెగసి పయనమయ్యెను.

క్రమముగ నడవులు మడువులు గడచుచుఁగొంతదవ్వేఁగి యేఁగి యొకయడవిఁ జొచ్చినవి. అటులు కొంత దవ్వేఁగ తెల్లని కుటీరములు-అటనొక తొలుకగుంపును-అందొక్కచో రాజపుత్రియుఁ గానవచ్చె. తత్‌క్షణమె చిలుక కట్టును విడిచి రివ్వు నేఁగి రాజపుత్రిబాహుపీఠమున వ్రాలెను. కాకంబులును కట్టి నటఁ బారవైచి రాజపుత్రీపునర్దర్శనానందము పారమునంద నెలుకకుట్టుల చిలిపిచేష్టలఁదలంచి యటకేగ శంకించి చెంతనొక పొదమాటున దాఁగియుండె. పిమ్మటఁ జిలుక రాజపుత్రిని మాటిమాటికి ముద్దిడుకొని-రాజపుత్రి! నీపోక కేమెంతయొ చింతించితిమి. నిన్నన్వేషించు వారమై చుట్టుపట్టులనెల్లఁ జుట్టి వచ్చితిమి. కాని మా యాయాసమ్ము వమ్మయిపోయె. తుద కొకనాఁడు కుటీరమునఁ గూర్చుండి నినుఁదలఁచి వాపోవుచుండ మాపాలిటి భాగ్యదేవతయోయనఁగపోతమొకఁడేతెంచినీకుశల మెఱిఁగించి నీయునికిఁ దెలియఁజేసె. జాలరి నీసేమమెఱిఁగి యెంత యు ముదితుఁడయ్యె. అంతనాతనికి త్వదన్వేషణార్థ మఱుదెంచు టెఱిఁగించి పయనమైతిమి. త్రోవ నేతెంచుచు కనఁబడ్డ తోడి జాతినెల్ల నీయునికి నడుగుచునె భాగ్యవశమున నిన్నుఁ జూడఁ గంటిమి. నావిని బాలిక జాలరికిఁ గుశలమా! నడుమ మీరాకకడ్డ మాఁకలు కలుగవుగదా! యని యీతీరుగ ప్రియభాషణము సలుపుచుండె.

ఇంతలో నట పొదమాటున డాఁగియున్న యెఱుకకుఱ్ఱ
లిద్దఱు హుటుక్కుని యెగిరివచ్చి చిలుకనట్టె యొడిసిపట్టిరి.
తోడనె తోడివారికిఁ జూపింప పరుగు పరుగున నేఁగిరి. అది
గాంచి బాలిక పెద్దపెట్టున విలపించుచు నెంతయొ బ్రతిమాలుచు
వారి వెంబడించెను. కాని యానిర్దయులకు దయరాదయ్యె.
చిలుక తన వాడిముక్కున నా యెఱుకకుఱ్ఱల చేతులు చీల్చి
చిందర వందరగావించె. అంత వారును విధిలేక విడిచిపెట్టిరి.
తోడ్తో శుకమటకుఁ జేరువనున్న చెట్టుకొమ్మమీఁదికేగి కూర్చుం
డెను. అదిగాంచిన యెఱుకత బాలికంజూచి— యేమిది ?
యన రాజపుత్రి — 'ఆ చిలుక నాయది. నా జాడ
నెఱింగి నాకడ కరుదెంచినది. మీ వాలు రద్దాని నొడిసి
పట్టిరి. అని బావురుమని యేడ్చుచుఁ బ్రపంచమున నా
బాగు కోరున దీచిలుక యొక్కటియే. మఱిమఱి వేఁడుదాన.
నా చిలుకను నా కిప్పింపుము—అనుచుఁ గన్నీరు మున్నీ
రుగా నేడ్వసాగె. అంత నయ్యెఱుకత " యిఁక నీవు చింతా
కంత చింతయు లేక యుత్సాహముగ నుండుము. బాగుగ
బలము వచ్చును. కాంతియు హెచ్చు. దాన మాకధిక
మూల్యము వచ్చును. అట్లగుచో నీ చిలుకను నీ కిప్పింతును"-
అని బాలురంజూచి యిఁక మీ రాచిలుక 'జోలి'కిఁ బోకుఁడు.
పోయితిరా శిక్షింతు సుమా? యని గట్టిగఁ గసరు కొనెను.
తోడనె చిలుక రాజపుత్రి బాహువుపై వ్రాలెను. కాకంబు
లును పనిపడుచోఁ బిలిచినఁ బలుకుటకు నట పొదమాటున
డాఁగి యుండెను.

నాఁటి సాయంతన మయ్యెలుకత యడవి కేఁగి యోషధుల నేరి తెచ్చి మృణ్మయ పాత్రమున బాగుగ మఱగింప నొక కొంత రసమందుఁ జేరుకొనెను. అద్దానిని బాలికకాపాదమస్తకము లేపనము కావించె. తద్రసగుణవిశేషమే మొకాని యామె కున్న గౌరవర్ణము గోదుమచాయగ మారిపోయెను. రాజపుత్రి యపు డచ్చముగ నెలుకలఁ బోలియుండెను. అంత నెలుకత బాలికం జూచి-అమ్మా! యిపుడచ్చముగ మమ్ముఁబోలియుంటివి. అదిగాక నీ సహజవర్ణముండెనేని లోకు లనుమానింతురు. నిన్ను మానుండి విడిపించి కొనిపోదురు. మాతలఁ గొందరు కూడ—అనుచు గందరగోళము గావించు నెడబిడ్డల కడ కరిగె. పిమ్మట రాజపుత్రి తనశయ్యకేగి శయనించె. శుకమాపె దరిఁ జేరి బిడ్డా! యిఁక భయమందకుము. ఎలుకత బాగుగ నిన్నాదరించి పోషించును. నీవు బాగుగ నున్న చోగదా యామె కధిక మూల్యమువచ్చుట? యని వివరించి యోదార్చెను.

అటులనె యెలుకత బాలికయెడ నత్యాదరము సూపుచుండెను. ఎలుకలీతీరుగ నెండవేళ నాఁగుచు నిశల రాకపోకల రాపిడి లేనిచోట నిద్రించుచు నేగుచుండిరి. కాకము లాకసంబున నెగయుచు రాజపుత్రిని వెంబడించుచుండె. కాని యెలుక లెఱింగిరేని కలఁకులు కావింతురని రాజపుత్రి వానిఁ గన్నెత్తియుఁ గాంచదయ్యె.

ఎండ తీవ్రముగఁ గాయుచుండెను. తిగ్మభానుఁడు నడిమింట వెలుంగుచుండె. ఎలుకలందఱును గుఱకలుగొట్టుచు నిద్రించుచుండిరి. అంతఁ జిలుక నిద్రించు రాజపుత్రికడ కరిగి చంచుపుటంబున

నాపెకర్ణపుటంబులఁ గొట్టి మేలుకొల్పి యెలుకల మేలుకొల్పుము; పులి వచ్చుచున్నది. పులి-పులి యని వచించె. అది విన్న రాజపుత్రి తోడనే మేల్కాని యెలుకల కడకరిగి, లెండు; లెండు పులివచ్చుచున్నది; పులి యని పెద్దపెట్టునఁ గేక పెట్టెను. ఆ కేకతో నందఱు మేల్కాంచిరి. అంత రాజపుత్రి దాపుననే పొదమాటునఁ బొంచియుండి తమపై దుముకు వ్యాఘ్రమును జూపెట్టెను. తోడ్తో నొక యెలుకత యట మండుచున్న కొఱవిం గొని పులిపై విసరికొట్టె. ఆదెబ్బతో నది గిఱ్ఱునఁ దిరిగి బొబ్బరిల్లుచు నొక్కపర్వున నదృశ్యమయ్యె.

ఎఱుకలు మఱునాఁటి ప్రత్యూషముననె పయనమై మధ్యాహ్నమగు సరికొక యిసుకమైదానము చొచ్చిరి. 'త్వరగ నేఁగవలయు. కానిచో నేఁడిది దాఁటఁజాలము. వేగముగఁ బదుండనుచు నెఱుకత హెచ్చరింప నెఱుకలందఱు బిరబిర నడవసాగిరి. రాసభము లోండ్రపెట్టుచు గులుకు పరువులు తీయుచుండె. అయ్యెడారి నొక్క వృక్షంబును గానరాదు. చూతమన్న నొక్క ప్రాణియుఁ జూపట్టదు. ఎండమావులు తెరలు తెరలుగఁ దరలుచుండె. పుక్కిలింతకైనఁ బుడిసెడు నీరు కానరాదు సింహములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, మానవులయు నస్థికలును, అస్థిపంజరములు నట నట వ్యాపించియుండె. చండభానుఁ డంబరమున మండుచు జీవరాసుల యుసురుఁ గొనుచుండె. నడచినకొలంది భారమధికమగుడు గార్దభంబులు నురువులు గ్రక్కుచుండె. ఉండ నీడయుఁ ద్రావ నీరును గానరాదు. బీటెండతాఁకున తలలు మాడుచుండెను. క్రింద

కాళ్లు బొబ్బలు పొక్కినవి. నాలుకలు పిడుచలు కట్టినవి. అడుగిడ శక్తి చాలదు. అటులనె తూలుచు త్రుళ్లుచుఁ గొంత దవ్వేగ నాతి దూరమున తాళవన మొకటి కానవచ్చె. అంత నయ్యాలుకత—అదిగో! తాళవనము; అందొక్క బావి కలదు. వేగిరమట కేఁగిన నీరు త్రావవచ్చును. అవ్వల కడుపున చల్ల కదల కుండ నేఁగవచ్చు. ఇఁకఁగొంత తడవోపిక పట్టుఁడనుచు హెచ్చరించెను. వారును లేనిమోపిక తెచ్చుకొని నడువసాగిరి. అతి ప్రయాసమున నా బావిచెంత కేఁగి యందు తొంగిచూచిరి. వారి యాస యడియాసయయ్యె. అందుఁ గొంచెమేనియుఁ బానీయము లేదయ్యె. ఇంకఁగొన్ని క్రోశములదాఁక బావియొక్కటియు లేదని వారెఱుంగుదురు. దప్పికచే ప్రాణపంచకమున నొండు రెండు తప్పుచుండె. కాలు కదలింపను శక్తిచాలదు. కావున చెట్లనీడ నెక్కడివారక్కడ నోదెవాటుగఁబడియుండిరి. బాలికకు నాఁకలి దప్పు లతిశయిల్లె. నోట మాట రాదయ్యె.

అది గాంచిన చిలుకెంతయుఁ జింతాకులిత స్వాంతమై తన్నికటముననె తాళవృక్షమునఁ గూర్చున్న కాకములం గాంచి "రాజపుత్రికి దప్పికచే ప్రాణము లటునిటు కాఁజొచ్చె. నీటితావులఁ బరికింపుఁడని వచింప నవి పరికించి వచ్చి-నీటి తావు లెచ్చటను గానఁబడవు; కాని నాతిదూరమున *"తర్బూజా"పండొకటి చెట్టు క్రిందఁబడియుండె నని చెప్పె-అది విని చిలుక చెట్టునీడ నలసిపడి యున్న బాలికం జూచి-అమ్మా! మెల్లగ లెమ్ము; కాకముల వెంబడింపుమని వచించె. అలసి సొలసి పడియున్న సొంపుకల

* ఖర్బూజకాయ

కాబాలిక "జో స్తి"యె పట్టదయ్యె. కావున రాజపుత్రి యుస్సురనుచు లేచి వాయసంబుల వెంటనే ఫలవృక్షముల కడ కరిగె. అటఁబడియున్న ఫలమొకదాని నగలించి చల్లనియుఁ దియ్యనిదగు ఫలరసంబు ద్రావి కొంత శుక కాకంబులకుఁ ద్రావనిచ్చె. అలసట తీరినంత మఱి రెండు ఫలంబులు త్రుంచి, వానితో నయ్యెఱుకగుంపు చేరి యెఱుకత కందించెను. అంత నయ్యెఱుకత గాఢాలింగనములను పునః పునశ్చుంబనములను బాలిక నట్టిటు కావించె. పిదపఁ దానును దనవారు నాపండ్ల నారగించి సేదదేరిరి. పిమ్మట నెఱుకలెల్లరు బాలికవెంటనే తర్బూజావృక్షముల కడ కరిగి తృప్తిదీర ఫలరసంబు సేవించి కుటీరముల నేర్పఱచి నాఁటిరాత్రి యచ్చటనె నిద్రించిరి.

మఱునాఁటి వేకువనె మేలుకాంచి కాల్యములు తీర్చుకొని యెడారి నెక్కడను జలముండదను భీతిచే పండ్లఁ గొన్నిఁటిగైకొని పయనమయిరి. కాని తక్కిన మైదానమంత నిర్జలంబుగాక అటనట నడబావులును—అందు పానయోగ్యమగు పానీయంబును గలవు. కావునఁ దరువాతి పయన మనాయాసముగనె సాగినది. ఎఱుకత,-ఆఁకలి దప్పులఁ బాపి తమ్ము రక్షించిన బాలికపై మఱింత యాదరమును జూపుచుండెను. మఱియు నామె నిటు లూఱడించె. అమ్మా!—నిన్నెన్నఁడో విడిచి పెట్టు దాననే; కాని మాయింటి వారంగీకరింపరైరి. అయినను భీతినొందవలదు. బాగుగా నిన్నాదరించి పోషించు సంపన్న గృహిణి కమ్మదునులే—అట నీవెంతయు సుఖమొందఁ గలవు.

అంతఁ గొంత కాలమున కామెుక లెల్లరు గుళ్ళు గోపురములు ప్రాకారములు గలిగి కనుల కెంతయు నింపు నింపు లాహోరు నగరము చొచ్చిరి. అట పురద్వారము ప్రక్కగ వృక్షచ్ఛాయలఁ గుటీరములు నిర్మించి నివాస ముండిరి. అంత నయ్యోుకత యచ్ఛమగు నోషధిరసము నొక మందసమునుండి తీసి తేటనగునీటఁ గలిపి బాలికనందు జలక మార్చెను. తోడనె తదోషధిగుణవిశేషమునఁ గాఁబోలు! రాజపుత్రికి సహజవర్ణము సమకూరెను.

---

# ఐదవ ప్రకరణము

బాలభానుని కాంతిపూరము తూర్పుదిక్కున వ్యాపించెను. శకుంత సంతానములు నాగరికులను మేల్కొలుపుటకో యన కిలకిలమని కూయసాగెను. పంచయరుగుల మీఁదఁ బరున్న బాటసారులు మేల్కొని కన్నులు నులుముకొనుచు లేచి పయనమగుచుండిరి. హూణవిద్యాధికులు సేవించు "కాఫీ" కొఱకుఁ గాఁబోలు; మందిరాంగణముల గొల్లలావులపాలు పితుకుచుండిరి. దాసదాసీజనము సంపన్నుల గృహాంగణములఁ గలయంపిచల్లి ముగ్గులు పెట్టుచుండిరి. అట్టితఱి యొఱుకత బాలికం దోడ్కొని నగరవీథిని జనుచుండెను. చిలుకయు బాలికబాహువు నధిష్ఠించి యుండెను. అటు లేగునెఱుకత రాజవీథివిడిచి సందుగొందుల నేగుచుఁ గొంత తడవున కొకవీథిఁ జొచ్చెను.

అట నొక మందిరపురోభాగంబున పంచయరుగుపై మహామ్మదీయుం డొకవృద్ధుఁడు పొగ ద్రావుచు నొకతివాచి మీఁదఁ గూర్చుండి యుండె. ఆతని చుట్టును నొకరు లనేకులు చుట్టి యుండిరి. చెంత నొక వ్రాతకలమును దినచర్యఁదెల్పు పొత్తమొకటియుఁగలదు. అటకుఁ జేరువనె దాస్యమునకు విక్రయించు బాలబాలికానివహముండె. అవ్వారిపై నధికృతగా నొక కోపన యగు వృద్ధభామిని నియోజితయయ్యె. అంత నయ్యెఱుకత బాలికను వెంటనిడుకొని వృద్ధునికడకరిగె. అతనికేదియొచెప్పి బాలికతో దాసీ జనము కడ కేఁగెను. అటనున్న ముదుసలి బాలిక యొద్దనున్న చిలుకంజూచి బొమలు ముడిపెట్టసాఁగె. అంతనయ్యె

బుకత - అమ్మా! కోపింపకుము; చిలుకనుగూడ విక్రయింతును లెమ్మనిచెప్పి, నేటి దినాంతముదాఁక వేచియుందును; అంతకు బాలిక విక్రయింపఁబడనిచో మఱల దోఁచ్కా_ని పోవుదునని రాజపుత్రి నామె కప్పగించి తానేఁగెను.

పాపము ! ఇవ్విధమున నాపాతకుల బారిఁబడ్డ రాజపుత్రి యెంతయు భీతిల్లి విలపింపసాగె. తుదకుఁ గర్తవ్యము గానక తోడివారికడ దీనవదనయై కూర్చుండెను. కానుపించెనేని చిలుక నపహరింతురని "చోక్కా_" చాటున దాఁచియుంచెను అంతఁగొంత తడవున కొక మనుష్యుఁడు దాసిని గొనువాఁడై యట కరుదెంచె. అరుదెంచి వృద్ధుని కా రాజపుత్రిని జూపెట్టి మూల్యమడిగెను. వృద్ధుఁ డద్దాని విలువ వివరింప నాతఁ డంతమూల్యము చెల్లింపలేక తిరిగి చనెను.

అతఁడ డేగిన మఱునిముసమె సతతము కోపస్వభావగాన కుటిలభ్రూకుటి యగు నొక బీబీ యటకరుదెంచి రాజపుత్రి విలువఁ దెలియఁగోరి వృద్ధునికడ కరిగె. ఆపె యటు చనినంతనె వృద్ధభామిని రాజపుత్రితో నిటులు వచించె.-"నిన్ని పెకమ్ముదానఁగాను. ఇట్టి దుశ్చరిత నిప్పట్టణముననె కాదు; ప్రపంచమున నెచ్చటను గానము. మొనమొన్న నె యొక చక్క_ని యువతి నీపెకు విక్రయించితిమి. ఇది పెట్టు బాధల కోర్వలేక పాప మాయువతి ప్రాకారము దాఁటి పారిపోవఁ బ్రయత్నించె. అంత నటనుండి జారి పుడమిపైఁబడి యసువులఁగోలుపోయెను. అది విన్న రాజపుత్రి ఖిన్నవదనయై-అమ్మా! నన్నా పాతకి చేతులఁ బెట్టకుము. మఱిమఱి వేడుదాన నని విన్నవింప వృద్ధ

భామిని-నామాట సాగనేని యటులనె కావింతు. వృద్ధుఁడు తా దన్నచో నాపెకే విక్రయింపక తప్పదనుకొందునని బదులుచెప్పె. అదివిని రాజపుత్రి:—అగుచో నా కీమాత్రము సాయపడుము. ఈ నా దురవస్థ నొకమా తా మెఱుకతకు విన్నవించుకొననిమ్ము. ఒకతూరి యామెకుటుంబము నంతయు మృత్యువాతనుండి తలఁగించితి. అప్పుడామె నిన్నాదరించి పోషించువారి కమ్ముదును లెమ్మని మాట యిచ్చెను. కావున నామె యిట కేతెంచెనేని నన్నీవిపత్తునుండి విడిపించునని నా విశ్వాసము—అని విన్నవించె.

ఈ సంభాషణ మాలకించు శుకంబు వేగిరమె వెలువడి బాలికబాహువు నధిష్ఠించి బిడ్డా! తత్‌క్షణ మా యెఱుకత నిటుబిలిచి వత్తునా? యనుచు వినువీథి కెగసి నగర వీథుల దాఁటుచు ప్రాకారద్వారము వెలువడియె. తోడ్తో నయ్యెఱుకదానికుటీరము చొచ్చి, యాపెపాదముల కడ వ్రాలి చంచుపుటంబున నాపె చీరెచెఱగు లాగియు, ఱెక్కలతో భూమిపై టపటపకొట్టియు, పట్టణప్రాకారద్వారమున కేఁగి వచ్చుచుఁ గిలకిలారావములు కావించియు, నుత్తమాంగమున నిటు రమ్మను తీరుగ సైగగావించుచు నగరముఁ బ్రవేశించె. అదిమెఱింగిన యెఱుకత దాని వెనువెంటనె చనుచుండెను. ఈ తీరుగఁ గొంతదవ్వేగ నొక్కతీరుగ విలపించుచు వెంబడించు రాజపుత్రియు నాపె చేయిపట్టుకొని తమ కెదురేతెంచు బీబీయునుఁ గానుపించిరి.

ఇప్పిశాచి బాలికను మఱునాఁటికిఁ బీల్చి పిప్పిచేయకుండునా యని యంగలార్చువారును, ముక్కుపచ్చలారని

ముద్దుబాలిక నీపెచేతఁబెట్టిన విధిచేత నేమనం గలారమని పోగయువారును, మొన మొన్న నెకదా! నవ్యనవనీతకోమలయగు నారీమణిని పొట్టబెట్టుకొనె నింతలో నిదియొక తెయా యని ముక్కున వ్రేలుంచువారును, ఈదురాచార మెన్నడు దూర మగునో యని దురపిల్లువారును, ఎంత దాని కింత వచ్చెనని వంత చెందువారును, నుదుటివ్రాలు తప్పునా! యని బాలికను జూచి కన్నుల నీరు నింపువారును, నీకుఁ దోడు దాసి కావల సెనా! యని బీబీని ముంజేతులఁ బొడుచు వారునై-జనులు గుంపులు గుంపులు గూడి యుండిరి.

ఇంతలో నయ్యొఉకత తమ్ము సమీపించుటయు బాలిక చటుక్కున నాపె విడిపించుకొని యొఉకత కడకేఁగి నిలిచి, అమ్మా! నన్నాపాతకిని చేతులఁ బెట్టకుము. మొన్న మొన్న నె యొక యువతిని మన్ను గావించినదఁట యని విన్న వించె. అంత నయ్యొఉకత మిగుల జాలిఁగొని బిడ్డా! భయమంద కుము. నిన్ని పెకమ్మనులెమ్మని యభయమిచ్చె. పిదప నమ్మహమ్మ దీయవనిత యొఉకదానిఁ జూచి దీనినే వెలకు విలిచికొంటి. మూల్య మును జెల్లించితి. నీవేరు-అడ్డగించుటకు? రసీదిదిగో! చూడుము. అని హుమ్మనుచు నోడినుండి పత్రమొకటి దీసి చూపెట్ట సాగె. ఇంతలో నొక శుక మాజనసమూహము మీఁదుగ నెగిరివచ్చి యద్దాని నోడిసిపట్టి గగనమున కెగసెను. తోడనె దాపుననున్న గోపురశిఖరముకడ దాఁచి తానొక ద్వారముకడ దాఁగియుండెను. అంతట నలజడి యధికమయ్యెను.

ఇంటిలో నింటిపనులు చక్కఁబెట్టు సబ్ ఇన్‌స్పెక్టర్ తారానాథున కీ కలకలము వినవయ్యె. అంతనాతఁడు ఇదేమా! యని త్రొక్కుడువడుచు "పదుఁడు పదుండు" పట్టణమున నేఁటియె యొక కలకలము సాగినది"—అనుచు రక్షకభటుల పటాలముఁగొని పరుగుపరుగున నేఁగి యాగుంపునఁజొరఁ బడెను. ఏమిది? ఈ యలజడికిఁ గతంబేమి? యనుచుఁ బలు ముగంబులు చూచి ప్రశ్నింపసాగె. దానికిఁ బలువురు పలువిధములఁ బలుకసాగిరి. తుదకొక బీబీ యతనిఁ జేరి, బాబా! నేనీ బాలికను వెలకు విలిచికొంటిని. దానికి మఱల నీతగవులాఁడి తగవులాడుచున్నయది-యని విన్న వింప "ఆఁడిపోఁకలం బోకుము. నీకు దీని నే విక్రయించితినా ? మఱిమాటాడుము; బుద్ధిఁజెప్పింతు"నని యొఱుకత కసరికొట్టెను. పిదపఁ దారానాథుఁడటవారి రాఁ బిలిచి బీబీనిఁగాంచి "నీవీ బాలికను నిజముగఁ గొంటివా? అగుచో రసీదు చూపెట్టు మనవుడు నామె శుక మొక డేతెంచి యొడిసికొని పోయినది. ఆఁడు దాన నేనేమిచేయుదాన బాబూ" యని కన్నుల నీరు నింపు కొనియె. దానికాతఁడు-"ఇదినే విశ్వసింప. టక్కరి పోకడల కేఁ జిక్కువాఁడఁగాను. రసీదు తెమ్ము; అవ్వలబాలికం దోడ్కొని పొమ్ము. కాదందువా? బాలిక నాపె కప్పగించువాఁడ నని మిన్న కుండెను. అది విని బీబీ నిజముబాబూ!యని పలుతెఱఁగుల బ్రతి మాలెను. కాని ప్రయోజన మిసుమంతయుఁ గానరాదు. అటవా రేరును మాఱుమాటాడరైరి. తుద కధికారి బాలికనయ్యెఱుకత కప్పగించెను. పాపము!సొమ్ము నిష్ప్రయోజనమ్మగ వమ్మయ్యె.

బాలికయు దక్కదయ్యె. కావున బీబీ రెంటికిం జెడిన రేవఁడు వోలెఁ జిత్తము పుల్లగిల్ల తెల్లవోయిన మోముతో నింటికిఁ జనెను.

తారానాథుఁ డట గుంపును జెదరఁగొట్టి యింటి కేఁగెను. అంతలో నాతనింటిచాకిరి చేయు దాసి యొకతె బాలికం దోడుకొని చను నెఱుకతంజూచి—అమ్మా! మా దొరసాని నీతో మాటాడఁగోరి రమ్మన్నది- నా విని యెఱుకత రాజపుత్రిని వెంట నిడుకొని దానిని వెంబడించెను. అటు లేఁగు నమ్మువ్వురొక యింటఁ జొచ్చిరి. అందు రాజపుత్రి కీడుజోడుల సరిపోలు దయాదేవి యను ముద్దుబాలిక తన జననింగాంచి—అమ్మా?—ఆ యమ్మాయి యెంత బాగుగనున్నదే; నా కామెం గొనిపెట్ట వఁటే? మేమిద్దఱము తోడు తోడుగ నాడుకొందుమనుచు మురిపెంపుఁబలుకుల తల్లి నిట్టుసేసె. అంత నాపె "అబ్బా! కొందునులే; ఇఁక నీయల్లరిచాలింపవే" యని కసరుకొని యమ్మా! దీనివెల యెంత? వేయి దీనారములా? అయిన నివిగో నొడిపట్టుమని మూల్యముచెల్లించి బాలికను స్వీకరించెను. రాజపుత్రియు వారిగుణము నాకృతికిఁదగ్గదిగా గణించి యెంతయు ముదితయయ్యె. పిమ్మట నయ్యెఱుకత తన ధనము గైకొని రాజపుత్రింగాంచి "నీకోర్కి సెల్లించితి; ఋణంబును దీర్చుకొంటి. వీరెంతయు సదయహృదయలు. నీ విట చాల సుఖమందగఁలవు. ఇఁక నేఁగుదునా" యని యమ్మగూఁతుల వీడ్కొని వెడలిచనియె.

పిమ్మట నబ్బాలిక లిర్వురు నొక పంచను గూరుచుండి రాకపోకలు కావించు మనుష్యులఁ గాంచుచుండిరి. అంతకు మున్నె ప్రాకార ద్వారమున డాఁగియున్న కీరంబు కిలకిలారావం బు కావించుచు నేఁగుదెంచి రాజపుత్రిబాహుపీఠమున నధి వసించె. అది గాంచిన దయాదేవి యవధిలేని యచ్చెరువంది ఇదేమిటమ్మా చెప్పవూ? యని యడుగ రాజపుత్రి శుకోదంతము సాంతమెఱింగించె. అంత దేవియు నాదగ్గఱ నుంచుకొందునా యని కీరమును చేరందివిచి ముద్దు ముచ్చటలు నెఱపెను.

బాలికలిర్వురు ఒక కంచమునఁ దిని యొక మంచమునఁ బరుండియు నాటపాటల నొక్కటై, పొఱుపు-విఱుపులు లేక పరస్పర స్నేహభావమున మెలఁగుచుండిరి. ఈతీరుగఁ గొన్ని నాళ్లుగడవ రాజపుత్రి యాత్మవృత్తాంతమును అంగుళీయంపు మహత్వమును దయాదేవి కెఱింగించెను. ఒకనాఁటిరాత్రి శుక మా రాజపుత్రింగాంచి యిఁక నీమాతామహుజాడ నెఱుంగుట శ్రేయ మనుకొందును. నీయునికి నెఱుంగని యతఁ డెంతగా గ్రుంగి కృశించెనో? తేపకడనె కాకంబులకడ కరిగి నీయుదంత మెఱింగించి యాతనికడకుఁ బుత్తెంతును. మఱియు నిన్ను గుఱించి యాతఁడేమి తలపోసెనో యెఱింగి రమ్మందు నని వచించె. మఱునాఁటి ప్రత్యూషముననె రాజపుత్రి తాతకై పత్ర మొకటి లిఖించి చిలుక కందఁ జేసె.

అదియు నదిగైకొని కాకములకడ కేఁగి వేగిరమా గంగోత్రి కడ కేగుఁడు; ఈలేఖ నాయోగిపుంగవున కందింపుఁడు.

ప్రత్యుత్తరము గైకొని సత్వర మిటకు విచ్చేయుఁడని లేఖ నందీయ నవియు తత్క్షణమట వీడి చనియె.

సూర్యభగవానుఁ డపరాంబుధి చేరుచుండె. యోగి చింతాకులిత స్వాంతుఁడై - బాలికజాడ యెఱుఁగరాదయ్యెనే! కాకంబులును రాకపోయె. ఇఁక నాపెజాడ నెఱుంగ నెవ్విధ మొకో? యని వగలు మిగులఁ బొగులుచుండె. అంతలో కావు కావు మనుచుఁ గాకములు రెండట కరుదెంచి యొకలేఖ నాయోగిముందు నుంచె. అది గాంచిన యోగి పరమానంద భరితుఁడై చదివియు మఱల మఱల చదువసాగె. పిదప దానికిఁ బ్రత్యుత్తరమును పూర్తికావించె. కాకము లట నొకనాఁడు విశ్రమించి యలసట చన్నంతఁ బత్రము గైకొని యోగి వీడ్కొని లాహోరు నగరముఁ బ్రవేశించెను. అట గదిలో నాటపాటలఁ దేలు బాలికలంగని తాము దెచ్చిన ప్రత్యుత్తర మారాజపుత్రి కందఁజేసె. పిమ్మట రాజపుత్రి యాపత్రమును తోడిబాలికకు వినుపింప నిటులు చదివెను.

"నా యనుంగుబిడ్డా ! నిన్ను మఱలఁ గాంచు భాగ్య మీ మందభాగ్యునకు లేదయ్యె. మీయమ్మ మరణించినది మొదలు నిన్నుఁ దలంచిన నాహృదయ మెంతయు ద్రవించు చున్నది. పడరాని పాట్లు పడితివి. ఆపరాని యాపద లనుభ వించితివి. అవ్వానితోన కుమిలి కృశించితివి కాఁబోలు. నేఁ డవన్నియు విశాఖాంతమున మేఘములు వోలె విరిసిపోయె. తుదకు సాదరముగఁ బెంచి పోషించు చల్లని తల్లి యండఁ జేరితివి. ఇది విన్న నామదియు నెమ్మదిగాంచినది. ఇఁక

నీయనుంగు చెలికత్తెకడనె కాలము గడపుచుండుము. అచట నీ యునికి దుర్భరమైనను నీయాప్త మిత్రములగు శుకకాకంబులు నీకుఁ దోడుపడలేకపోయినను—అది నాకెఱుకపఱుపుము" అని చదివియు మఱల చదివి దానిఁ బదిలపఱచెను.

బాలిక లిర్వురక్కచెల్లెండ్రు వోలె మెలఁగుచుండిరి. క్రమముగఁ గమలాతారానాథులు "రాజపుత్రిని కాశ్మీరాధీశు ముద్దుకూఁతుగా నెఱింగి యాపెయెడ దయాళురై మిక్కిలియు నాదరము సూపుచుండిరి. మఱియు నబ్బాలికలం జూచి "యీ యుదంతము బుక నీయకుఁడు. అగుచో రాణి యీపె యునికి నెఱింగి తిరుగ వెంబడించును." అని చెప్పిరి.

# ఆఱవ ప్రకరణము

బాలిక లిద్దరు దయాదేవిశయనమందిరమున నల్లిక, కుట్లు, మున్నగు చేతిపనులయం దాసక్తచిత్తలై యుండిరి. తారానాథుఁడు కొలువువీడి యప్పుడె యింటికి విచ్చేసెను. ఆతని ముఖము నాఁడు కళావిహీనముగఁ గానవచ్చె. అది గాంచిన కమలాదేవి నాథునిడగ్గఱి—నాథా, నేఁడు మీ మోమిట్లు చిన్నవోయినదేల? అనిష్టమేమియు రాదుగదా? నా విని తారానాథుఁడు హీనస్వరమున నేఁడొక గాలివార్త పట్టణమంతయుఁ బ్రసరించినది. కాశ్మీరదేశపు ఏలిక మరణింప రాణి తనకుమారుని గద్దెనెక్కించి రాజకీయములు స్వయము నవరించు చున్నదఁట యని మిన్నకుండె. అది విన్న రాజపుత్రి పిడుగడఁచిన చందమున నిష్ప్రహయై నేలఁగూలెను. తోడనె దయాదేవి తల్లిదండ్రులఁ బిలిచె. వారునట కేఁగి శీతలోపచారము లాచరించిరి. రాజపుత్రి కొంత తడవునకు స్మృతికలిగి కమలాదేవి కాళ్లకుఁ జుట్టుకొని విలపింపసాగె. ఆపెయు బాలిక ననేకవిధముల ననునయించెను. నాఁడునాఁటికి రాజపుత్రికి పితృమరణశోకంబు సన్నగిల్లెను.

ఈతీరుగఁ గొన్నినాళ్లుగడచినవి. అంతనొకనాఁడు మధ్యాహ్నమున కమలాదేవి వీధిగదిలో బాలికలిరువురంగూడి గూర్చుండియుండె. వారికప్పుడు వీధినేఁగు జనసమూహ మొకటి కానవచ్చె.

గుఱ్ఱముల నెక్కి కొందఱు; ఏనుగుల నెక్కి కొందఱు; పాదచారులై కొందఱు నేఁగుదెంచుచుండిరి. వారి నడుమ నొక గజము నధిష్ఠించి సర్వాభూషణ భూషితుఁడై చుట్టును గొంత పరివారము చుట్టియుండ వాహ్యాళి వెడలు సురాధినాథుఁడువోలె నొక పురుషపుంగవుఁడు మందగమనమునఁ జనుదెంచుచుండె. ఆతని ముంజేతి స్వర్ణకంకణమున లేఖకాఁబోలు వ్రేలుచుండెను. ఆతఁడే మనరాణి భృత్యుఁడు "బబ్బా" యను పేరివాఁడు.

అది గాంచిన రాజపుత్రికి కాయము కంపించెను. ముచ్చెమటలు క్రమ్మెను. అంత సైన్యము దూరమేఁగుదాఁక నట మూలదాఁగియుండెను. సైన్యమేఁగిన కొంత తడవునకుఁ గమలాదేవి కొలువు వీడి యింటికేతెంచిన నాథునిఁగాంచి— నాథా! వీథినేఁగిన సైన్య మెవ్వారిది? యన విని యాతఁడు కాశ్మీరదేశపురాణి దూత నిటకు రాయబారమంపినది. తత్‌క్షణము కప్పము చెల్లింపుము; కానిచో తేపటనె పట్టణము ముట్టడింతుము-అని తీవ్రముగ లేఖ వ్రాసినది. దానిఁజూచిన తేఁడు రోషారుణిత నేత్రుఁడై యద్దానిఁ జింపి దూరమునఁ బారవైచె. మఱియు నాదూతను తత్‌క్షణ మిప్పట్టణము విడిచిపొమ్మని తీవ్రముగ శాసించెను. అంత నాతఁడు గడగడ వడఁకుచుఁ గాశ్మీర మేఁగెను.

ప్రయాణ పటహములు దిక్కుల మాఱు మ్రోగినవి లాహోరు సైనికులు పోరుసలుప తండోప తండములుగ నేఁగుచుండిరి. కమలాదేవి బాలిక లిరువ్వురంగూడి వీథిగదిలోఁ గూర్చుండి

దేవి నాథుడగ్గతి "కొలువువార్త లేమి ? సంధి నెట్లు కూర్చిరి?—అని ప్రశ్నింప నాతఁడు— "ఏమి చెప్పుదును; ఏఁటేటఁ గప్పముఁ గట్టుచుండవలయు. ఇప్పుడో! వస్తువులు—వాహనములు, నగలు—నాణెములు, వెయ్యేల ధనాగారమునను, పట్టణమునను గలదంతయు సమర్పింపవలయు. ఇట్లు కావించినఁగాని యాపె యారటము తీరదఁట. మన కీఁక గట్ట గుడ్డయుఁ దినఁ గూడును కఱవగును. కాని మన మాన ప్రాణములు దక్కెను.—అని యొక్కనిట్టూర్పు విడిచెను. అది విని దయాదేవి తండ్రిమొగంబై—అగుచో రాధ నిచ్చటనె మనతో నుంపరాదా? వేఱొక్క తావునకుఁ బంపనేల? యని రాజపుత్రిపైఁ దన మమకారమును వెల్లడించెను. దాని కాతఁడు అమ్మా! అటుగాదు. బహుమూల్యమిచ్చి యామెను గొనియుంటిమి. అది యిరుగుపొరుగువారి కందఱికెఱుకయె. కొండెములు చెప్ప వారెంతయు ప్రచండులు. పగతురు పట్టణములఁ గల యిండ్లన్నియు నన్వేషింతురు. మన యింట ధనముతోఁబాటు బాలికనుగూడ నపహరింపఁగలారు. అగుచో మనయింట నాపె నెట దాఁప గలము తల్లీ! యని యుస్సురనుచు మెల్లగ వీథికేఁగెను. ఆ పలుకులు తమకర్ణపుటంబులకు ములుకులై నాట శోకపూర్ణమగు నాతని మోముతీరుఁ గని యమ్మువ్వు రొకరి కొకరుగా నేడ్వసాగిరి.

పిదప శుకంబు వెంటనె రాజపుత్రిబాహువు నధిష్ఠించి—అమ్మా! యేడువకుము. ఊరటపొందుము. నిన్నొక నిగూఢ స్థలములన దాఁచియుంతుము. మన మందిరోద్యానము వెనుక

ప్రాకారమున కవ్వల పురాతన సౌధమొకటి కలదు. అది మన కాప్తమిత్రములగు కాకముల కావాసము. తత్సౌధోపరిభాగమున నొక చిన్న గది కలదు. నీవందు దాఁగియుండవచ్చును. అగుచో నీకేమియు కీడురాదు. కాని దానిక్రిందిభాగమున సోపానము లేదెనిమిది శిథిలములయ్యె. దాని కొక యుపాయ మరయవలయు. ఎద్ది యందువా? మనయింట నొక దారపుఁ జుట్ట కలదు. దానిచే మనయాప్తుల సాయమున, నిచ్చెన నొకదాని నేర్పఱుపవలయు. అద్దానిఁ గాకములద్వారమున మేడ మెట్లకడకుఁ జేర్పవలయు. అంత నేనటకేఁగి యందొక కొననట మెట్లవరుసకుఁ గట్టియుంచెద. మఱొకదాని క్రిందికి విడిచెద. దాని సాయమున సౌధోపరిభాగమునకుఁ జేరఁగలవు. అన విని రాజపుత్రి కమలాదేవి కడకేఁగి తా విన్నదంతయు వివరించి చెప్పె. అంత నమ్మువ్వురు దారముతో నిచ్చెన నొకదాని నేర్పఱచి కట్టకుఁ జుట్టరి. పిమ్మటఁ గమలాదేవి తన కూఁతుఁజూచి 'మన మేడనెక్కి రాజోద్యోగు లెటనుండిరో పరికింపుము." నావిని-దయాదేవి మేడనెక్కి పరికించి వచ్చి, వారు కడుదవ్వ ననే యిండ్ల నన్వేషించుచుండిరి. ఇంతలో నిటకురారనుకొందు. కావున ప్రొద్దు గ్రుంకినంతనె రాజపుత్రి నటకంపుదమని చెప్పె.

కమలబాంధవుఁ డపరాంబుధి చేరెను. తోడనె కమలాదేవి దారపుటుండ గైకొని రాజపుత్రింగూడి పక్షిగణంబుతో నుద్యానముఁ బ్రవేశించె. ఉద్యాన ప్రాకారము నాని యెత్తైన మంటిదిబ్బ కలదు. దానిమీఁదుగ ప్రాకారముదాఁటి ప్రాఁతమేడ కడ కేఁగెను. అంత రాజపుత్రి కాకములంగాంచి "దీని నామెట్ల

కడకుఁ జేర్పుఁడని దారపుటుండను వానికిచ్చె. అవియుఁదమచంచుపుటుంబులఁ జెరియొకకొనను గఱచిపట్టి యతిప్రయాసమునఁ గొంతదవ్వు చని యంత నేఁగఁ జాలక టపటప కొట్టుకొనుచు నేలఁగూలెను. చిలుకయు శతవృద్ధుగాన వానికిఁ దోడుసూప లేదయ్యె. అంతఁ గర్తవ్యము గానక నిరాశాహతములై తిరిగి రాఁ బ్రయత్నించుచుండెను. అత్తఱి భయంకరాకృతిగల దివాంధమొకటి నింగినెగయుచు నేఁగుదెంచి తత్సౌధశిఖరంబునఁ గూర్చుండెను. అది గాంచిన కీరము రాజపుత్రింగాంచి "యుంగర మెక్కడ? ఇటందిమ్మని యంగుళీయకముఁ గైకొని యులూకముకడ కరిగె. అట నుంగరము చూపి దాని నీమేడ మెట్లకడకుఁగొనిరమ్మని దారపుటుండఁజూపించె. అంత నులూకమద్దానిని మెట్లపైఁబెట్టి వినయావనతోత్తమాంగమై యిఁక సెలవా! యని ప్రశ్నింప, నీ వీరాత్రియంతయు నీశిఖరముననె రాజపుత్రికడఁ గాపుండుము; ఏదేని భయోత్పాతము గలుగుచోఁ దోడ్తో నది మాకెఱిఁగింపు మని యానతిచ్చి దాని వెడలించెను.

పిదప శుకంబు త్రాటినిచ్చెనను విడఁదీసి మెట్లలో చివర దానికొకకొనను దిట్టముగఁగట్టి మఱొకదాని క్రిందికి వ్రేల వైచెను.

అంత రాజపుత్రి యటనున్న యమ్మగూఁతుల వీడ్కొని మెలమెల్లఁగ నిచ్చెన నెక్కి మెట్లకడ కరిగి త్రాటిని దన కడకు లాగుకొని గదికేఁగెను. అటఁ దాఁ దెచ్చిన దుప్పటి కప్పుకొని సుఖనిద్రసెందె. కమలాదేవి పక్షుల నట భద్రముగా మెలఁగుం డని చెప్పి దయాదేవి వెంట రా నింటి కరిగెను.

ప్రొద్దు పొడిచి బారెడెక్కినది. పద్మబాంధవుని బాల కిరణములు రాజపుత్రిని మేల్కొల్పుటకో యన గవాక్షద్వారమున నామెపైఁ బ్రసరించెను. తోడనె, రాజపుత్రి మేల్కాంచెను. అంతకుమున్నె లేచి యాహారాన్వేషణమునకై కాకంబు లడవి కరిగెను. చిలుకయుఁ దా మచటి కేఁగుదెంచునాఁడు రాత్రివేళఁదెచ్చిన యాహారమును బాలికయుఁ దాను భుజించి నగరవిశేషము లెఱుంగఁ దారానాథు నింటి కేఁగెను.

నగరమంతయు నల్లకల్లోలముగ నుండెను. అప్పుడె రాజోద్యోగులు తారానాథు నిల్లు కొల్లగొన నన్వేషించుచుండిరి. తారానాథుఁడు తనయింటఁగల సొత్తంతయు వారి స్వాధీనము కావించుచుండెను. అశ్వశాలలోని యశ్వము లన్నియుఁ గొనిరాఁబడి వారికడ నిలువఁబెట్టఁబడెను. మఱియు దాసీజనము వరుసగఁ గూర్చుండియుండ నధికారు లవ్వారిలో కంటికింపగువారి నేర్పరించుచుండిరి. అట్లేర్పఱించిన పనికత్తెలలో నొకతె “అయ్యా! యీయింటియం దొకదాసి దాఁపఁబడినది. మే మామె గోటికొనకైనను సరిపోలము. మిగుల రూపసి. కావున యజమానుఁడు దాని కధికమూల్యము వెచ్చించెను. ఆతఁడామెయెడ దాసీభావముంపక కూఁతుగాఁ బ్రేమించువాఁడు” అని వచింప, నధికారి “దానిపేరేమి? యన విని దాసి యామె యూరుపేరు లేమెఱుంగము. ఒక శుకమామెకడనెప్పుడు తిరుగుచుండును. కావున మే మామెను “చిలుకదాసరి” యని పిలుచుచుందుము. అదిగో కాంచుఁడు—ఆ శుకమదియే. ఆమెయు నిటకు దాపుననె యుండనోపు—నని యామె కడుపుబ్బరము

పోకార్చుకొనెను. అది విని తారానాథుఁడు—ఇట్టిదాసి యొకటి నా కున్నమాట వాస్తవమె. కాని యాపెయునికి నే నెఱుంగ. మాటలేల! గృహంబు మీ హస్తగతంబు గావించితి. మీ యిచ్చవచ్చినటులు పరిశోధించుకొనుఁడు; నేఁ గాదంటినా; యని విన్నవించె.

కమలాదేవి, బాలిక నొకచో భద్రపఱచితిమి. ఇంత కెక్కుడుగ నీ వెఱుఁగ రాదని యొకపుడు నాథునికి సవినయముగ విన్న వించుకొన్నది. కావున నాతఁ డెఱుఁగని మాట సత్యేతరము కాదు.

పిమ్మట నధికారులా గృహము నలుమూలలఁ బరిశోధించి రాజపుత్రి యెందునుఁ గానరానందున "నాపె యెటకో బాఱి యుండవలయు. అనతికాలముననె యాపెయు మా వశము కాకపోదు." అనుచు కొల్లగొన్నధనము తోడ్కొని మఱొక యింటి కేఁగిరి.

వారేగిన పిమ్మట దయాదేవి యిట్లనియె:—అమ్మా! యిఁక మన రాధ నింటికి రాఁబిలువఁగూడదఁటే ?

కమలాదేవి—వలదు; వలదు; సైన్య మిటనుండి యేఁగు దాఁక రాధ యచ్చటనె యుండవలయు.

దయా—అగుచో నే నీ రాత్రి యట కరిగి రాజపుత్రినిఁ జూచి వత్తునా ?

కమలా—అటులే యేఁగుదువు లెమ్ము. కాని నీరాక పోక లొరులెఱుఁగరాదు. ఎప్పు డేయాపద ఘటిల్లునో యెవరి కెఱుక. అట కేఁగియు భద్రముగ మెలఁగవలయు.

దయాదేవి—అమ్మా! పగతురు మేడ పైకి నొక్కుమ్మడి యెక్కి రాకుండ కావలిగాఁగాకంబులు లేవఁటే? అగుచో భయమేల కలుగు? ననుచు చిలుకం బిలిచి "నేనీరాత్రి యట కేఁగుదెంతు; వచ్చునపుడు కొంత చిఱుతిండియుఁ గొని వత్తును"-అని లేఖ వ్రాసి దానికిచ్చి వెడలించెను.

---

# ఏడవ ప్రకరణము

రాజపుత్రి యొకపుడు చిలుకతోఁ బ్రియము భాషించియు మఱొకపుడు అల్లిక-కుట్టు మున్నగు చేతిపనులఁ జేసియు— ఇంకొకపుడు నీతిగ్రంథములు వల్లెవేసియు, నీతీరుగ రెండు మూఁడు నాళ్లాగడియంచె గడపినది. అంత నొకనాఁడుబుసుఁ పోవక గది నలువంకలఁ బరికించుచుండ, గోడను బెట్టు సడలిన తాయి యొకటి కానవచ్చె. అద్దానిఁ బట్టిలాగ నట్టెయూడి క్రిందఁబడెను. అట్లేఱుపడిన కుడ్యరంధ్రము నలుమూలలు తీరియుండె. అద్దానిద్వారమునఁ దారానాథు నిల్లు సూటిగఁ గన్పట్టుచుండె. విశిష్య—తానును దయాదేవియు నేక శయ్యను శయనించిన మంచము గవాక్షద్వారమునఁ గన్పట్టు చుండెను. కావున రాజపుత్రి యద్భుతానంద మనుభవించెను. అంతలో దేవి వ్రాసినలేఖ గైకొని శుక మటకు విచ్చేసె. దానిఁజూచి దయాదేవిరాక కెదురుచూచు రాజపుత్రికి నిముస మొక యుగముగఁ దోఁచుచుండెను.

ప్రొద్దు గ్రుంకినది. అంధకారము నలువంకల నావరించెను. తోడనె, శుకంబు సౌధము నలుదిక్కులఁ గాపుగా కాకోలూకముల నుండఁబంచి దయాదేవిఁ దీసికొనిరాఁ బయనమయ్యెను. కమలయు రాజపుత్రిని జూడ నుబలాటపడుచుఁ గూఁతుతో నుద్యానమున గోడకానియున్న మంటిదిబ్బపై చిలుక రాక కెదురు చూచుచుండెను. ఇంతలోఁ జిలుక యటకే తెంచుడు దయాదేవింజూచి "నీ వచ్చుదాఁక నే నిటనె వేచియుందును-

రాజపుత్రి కడకేఁగి తిరుగ చిలుక నిట కంపుము. దానిచే మఱలా నీరాకకై సమయ మెఱిఁగింతును. అందాఁక నీ విటకు రారాదు. నీరాకపోకలేరైన నెఱింగిరేని మనకుఁ దలముక్కలు గాకపోవు. జాగ్రత్తసుమా" యని చెప్పిపంచెను. పిమ్మట దయాదేవి మఱి దిబ్బమీఁదుగ ప్రాకారము దాఁటి ప్రాఁతమేడ కడ కరిగె. అరిగి చేసన్నచేయ, చిలుక నిచ్చెనత్రాటిని క్రిందికి వ్రేల వైచెను. అద్దాని సాయమున రాజపుత్రికడ కరిగె. తాఁ దెచ్చిన తినుబండారముతో నా రాత్రి తోడువిందు గుడిచెను.

అంత రాజపుత్రి దయాదేవింజూచి—"ఇచట కుడ్యంబున కొక రంధ్రంబు కలదు. ఇది మనము శయనించు మందిరమందలి గవాక్షమున కెదురుగ నుండును. నీవు తలచు దీనికడఁ గాచియుందువేని మన మొకరినొకరు చూడవచ్చును. చేసైఁతల మాటలాడుకొనను వీలగును. అనునంతలో కమల కడకరిగిన కీరంబు మఱలివచ్చి చుట్టుపట్టుల నిట నొక్క మానవుఁడైనఁ గానరాఁడు. కావున నిఁక నీ వేఁగవచ్చును. అని వచింప రాజపుత్రిని మఱలమఱల ముద్దిడుకొని దయాదేవి తన తల్లికడ కరిగె.

రాజోద్యోగులు వరుసగ నింటికింటికిఁ దిరిగి ధనము సమకూర్పసాగిరి. వలసినంత కప్పము వసూలు కావించునంతలో దినములు చాల గడచినవి. కావునఁ బట్టణమునఁగల ప్రజలెల్లరు విలువగల వస్తువులు చాటుమాటుగ దాఁటవేసిరి.

రాధాదేవి యొకపుడు కాకములమూలమున దయాదేవితోఁ బ్రియము భాషించియు, మఱొకమాఱు సందేశ

యుం దేమిగలదో చూతమని చెరచెర మేడమీఁది కరిగె. అరు గుట తడవుగ నిద్రించుచున్న రాజపుత్రి కానవయ్యె.

తోడనె, చిలుకదాసరీ! 'అహ్హాహ్హాహా' చిక్కితివి; చిక్కితివి! అని వెడనవ్వు నవ్వుచు రాజపుత్రి కడ కేఁగె. అట స్మృతి దప్పిపడియున్న రాకన్నియంగాంచి దీని నిప్పుడె రాజోద్యోగులకుఁ బట్టియిత్తును. తప్పించనినవారిఁ బట్టియిచ్చినను, వారిజాడ నెఱుకపఱచినను బహుమాకృతి నిత్తుమని ప్రతిన కావించిరి. కావున నాకు బహుమాకృతిలభించును. మఱొక్కటి-ఈపె పేటఁగల దాసి లోకమున మిగుల వాసిగన్నది. అగుటఁ దీనిఁ బట్టియిచ్చుచో బందెనుండి పరుగెత్తిన నా యపరాధము మన్నించుటయె కాదు; బందెనుండియు విడిపింతురు—అనుచు నటనున్న దుప్పటిని రెండు కావించి యాపెకాలుసేతులు దిట్టముగఁ గట్టివైచె. పిమ్మట నిఁక నేఁగుము; ఎచటికేఁగుదో—అనుచునె నిచ్చెనదిగి త్రాఁటిని బట్టిలాగ నది యూఁడి క్రిందఁబడెను. అంత నద్దానిఁ జుట్టగఁజుట్టి పట్టుకొని యొక్కపరుగున నట వీడిచనియె. అంతకుమున్నె స్మృతితప్పి పడియున్న రాజపుత్రికి నాకట్టులు క్రొత్తఁదనమును గల్పింపవయ్యె.

అట్లు పరుగెత్తిన దాసి తిన్నగ పనికత్తెల బందెకడ కరిగెను. అట ద్వారపాలకుల యనుమతిఁ గొని రాజోద్యోగిని దర్శింప, నాతఁడు కోపోద్దీపితమానసుఁడై "నీవిటనుండి యేల పరుగిడితివి? ఇప్పుడె కొఱుత వేయింతు ననుచుఁ గట్టిగ గద్దింపసాగె. అమ్మాటలలో నెట్టులో చొరవగొని—అయ్యా! కోపింపకుఁడు;

వేయిరూప్యములు విలువగల దాసి నొకర్తు పట్టియిచ్చెద బహూకృతిగ నాకేమిచ్చెదరు? అని విన్నవించె. అంత నాతఁ డెంతయు ముదమంది, నిన్నిపుడె బందె విడిపింతుము; మఱియు నేఁబది మోహరులు బహూకృతి కావింతుము. కాని మోసము చేసితివా, తోలుగట్టుతోఁ జావకుండ బాదెదము"—అన విని దాసి, దొరా! అంతకుఁ దలంపకుఁడు—ఆలసింపకుఁడు. ఇప్పుడె నావెంటఁ గొందఱ బంటులఁ బంపుఁడు. వారీ త్రాఁటిపోఁడుగు నిచ్చెనఁ గొనిరావలయు. ఆపై నాపెను మీకప్పగింపనేనిఁ జెప్పనఁ గొట్టుఁడు. త్వరగఁ బంపుఁడు."—నావిని యాతఁడు నిచ్చెన నిచ్చి కొందఱ బంటుల నాపెవెంటనె వెడలించెను.

వారును వేగముగ మేడకడకరిగి నిచ్చెన నట మోటింప నొకభటుఁ డాసౌధమున కెగఁబ్రాకెను. అందేఁగిచూడ రాజపుత్రి జాడయుఁ గానఁబడదు. కాని దయాదేవి, రాజపుత్రితో నాటకై తెచ్చిన యాటవస్తువులును—అటనట రక్తసిక్తములై యంతలు నింతలు నగు గుడ్డపేలికలు కొన్నియుఁ గానవచ్చె. అంత నాతఁ డవ్వానిఁగొని రాజపుత్రి నన్వేషించువాఁడై మేడయంతయు గలయఁదిరిగి యాపెఁగానక తోడివారిం గూడి దాసి వెంటరా నింటి కేతెంచెను. అట నధికారి క్రోధ ఘూర్ణితనేత్రుఁడై భటులంగాంచి. "తోలుగట్టుఁగొని చావ మోదుఁ డీ దుర్జాతిని; నే తలంచినట్లు కావించినది" యని యానతీయ నాపె నోరనోర బాదుకొనుచు-"నిజముస్వామీ! నే దబ్బరలాడుదానఁగాదు; ఆపె నటఁగాంచి త్రాళ్లచే దిట్టముగఁగట్టి యొక్క పరువున నిట కేతెంచితి. ఇంతలో నెటు

తప్పించనెనో యెడము లేదుబాబూ! ఇప్పుడైన మించిపోదను కొందు. వెంటనె తారానాథు నిల్లువెదకుచుచో దొఱకక పోదు దొరా!" యనునంతలో రాజు స్వీయ మటకరుదెంచి పనికత్తెల మొత్తమెంత? యని ప్రశ్నించె. అధికారి నడచిన కథ యంతయు విన్నవించెను. తారానాథునిదాసి దాఁపఁబడ్డదని విన్నంతనె రాజు మండిపడుచు నాపె చిక్కుదాఁకఁ దారా నాథు కూఁతు బంధింపుఁడు. భటులఁ గొందఱ వెంటఁగొని దాని నన్వేషింప నొక యధికారి నిప్పుడె వెడలింపుఁడు. ఆపె కానుపింపదేని దయాదేవినిఁ బట్టితెండు"—అని తీవ్రముగ వచించెను. ఆకస్మిక మేఘగర్జన కంద అడలిపోయిరి.

వెంటనె భటులు కొందఱు తారానాథు నింటికేఁగి మూలమూలలఁ బరికించి యుద్యానమంతయుఁ గలయవెదకిరి. కాని రాజపుత్రి కానుపింపదయ్యె. అప్పుడా యమ్మగూఁతులు మేడమీఁదనున్న రాజపుత్రి కనిపించునో యని చింతాముద్రిత వదనలైరి. కాని యంతకుమున్నె భటులు రాజపుత్రి నన్వేషించు వారై మేడమీఁది కేఁగుటయు, నందాపె లేకుండుటయు నెఱిఁగిన వారిహృదయ మొకింత యూరటనందెను. కాని రక్షకభటులకడ రక్తమంటిన గుడ్డలఁ గాంచినంతనె రాజపుత్రి కేయాపద ఘటిల్లెనో యని వారి స్వాంతమెంతయుఁ జింతావశమయ్యె. అంతలో నా యధికారి—కమలాదేవికడ కరుదెంచి-రాజు, దాసికి బదులు దయాదేవినిఁ బట్టితెండని యానతిచ్చె నని వచింప తదేకపుత్రిక యగు నాపె డెంద మేచందమయ్యెనో వర్ణింప నేరితరము? శేషాహిచెప్పినను సశేషమే యగును. అట్టె నేలఁగూలిరి. స్మృతి

కలిగి పరస్పరము కౌఁగిలించుకొని యేడ్చిరి. ఆతని పాదములఁబడి పలుమాఱు ప్రార్థించిరి. ఎంతయొ విన్నవించిరి. కాని వినఁడయ్యె. రాజాధికారము దాఁట వశముకాదు. వెంటనె భటులాబాలికను బంధించి తోడ్కొని పోయిరి. పిదప రాజపుత్రినిఁ బట్టియిచ్చి బహూకృతి నందఁగోరిన దాసి కాలుసేతుల సంకెళ్లతో శిక్షామందిరమునకుఁ గొనిపోఁబడెను.

ఆపెను శిక్షించు టన్యాయ్యమె యగు. నిజమునకుఁ బాపమాపె మోసగింపఁదలఁపలేదు. కాని విధి యాపెను మోసపుచ్చెను.



# ఎనిమిదవ ప్రకరణము

పాపపుసామ్మున కాశించి కాలుసేతులు కట్టివైచిన దాసి యేఁగిన కొంత తడవునకు రాజపుత్రి స్మృతిదేరెను. తేరి యాతీరు తనయవస్థకు దిక్కుదోఁచక బిట్టు విలపించుచు నట్టె పడి యుండెను. పిమ్మటఁ గొంత తడవునకు కుడ్యరంధ్రంబు దిక్కై దృష్టిసారింప జ్యోతులువోలె కన్నులు రెండాపెకుఁ గానుపించె. తోడనే భీతిసెందె. మఱునిముస మాత్మరక్షణకై కాకంబులు నియోగింప నట తీవపై కాచియున్న యులూక మని యాపె మదికిఁ దోఁచెను. తోడ్తో నుంగరము స్మృతికి వచ్చె. అంత నయ్యంగుళీయకముగల యంగులి నవ్విహంగమునకుఁ జూపెట్టి పక్షిరాజమా ! నా కిపుడు తోడ్పడవలయు. ఆపన్నురాలను. అన విని దివాంధము తోడనే యటకరుదెంచి—పనియేమి యని తలయొగ్గి నిలిచెను. అంత రాజపుత్రి "నాకాలుసేతుల కట్టుల విడఁదీయుము"ని కోరెను. ఆ పాపురాలు తన యోపికకొలంది యాకట్టులఁ బిగించి యేఁగె. కావున నవ్విహంగమున కవి యొకపట్టున విప్పుట కలవికావయ్యె. అయినను-అతిప్రయాస మున వాడిముక్కున లాగియుఁ, బదనుగల గోళ్లసాయమునఁ జీల్చియు నెట్టకేల కాదుప్పటిని ముక్కలుముక్కలు కావించి బంధములు సడలఁజేసెను. అటులు కావించుటలో నాపెకాయ మున నొండురెండు గాయములయ్యె. అవ్వానిర క్తముతో నా దుప్పటిపేలిక లటనట సిక్తములయ్యె. ఆతీరుగ బంధములు విడిపోవ నటనుండి క్రిందకేఁగుట కుపాయము తోఁచదయ్యె.

సౌధమా యత్యున్నతము. సోపానములా శిథిలములయ్యె. త్రాటి నిచ్చెనయా ఆ పాపురాలు తీసికొని యేఁగె. కానీ దుముకుదమన్న జీవితాశ సున్న. కావున నేదియు పాలుపోక యులూకముం గాంచి-ఆపన్నురాలను; నాశత్రువు లీపాటికి దవుదవ్వులనె యుండఁ బోలుదురు. వచ్చెనా, నాజీవిత మధోగతి పాలగును. సాహాయ్యంబుననో యుపాయంబుననో నన్నీ మేడనుండి దింపుము-అని దీనముగవచించె. దివాంధ మాకారమున పెద్దయె. ఐనను రాజపుత్రి నటనుండి దింప శక్తిచాలని దయ్యె. కావున రాకన్నియం జూచి-బిడ్డా! క్షణ మాఁగుము. రాత్రి నిద్రలేమి నలసి మాయింటి దీమేడయందె నిద్రించు చున్నది. ఆపె నిప్పుడె పిలిచి వత్తును. మేమిద్దఱము నిన్నట నుండి పుడమికిఁ జేర్పఁగలమని నమ్మిక" యనిచెప్పి మేడ కొట్ట కొనకేఁగి పెద్దగఁ గూయసాగె. ఆకూఁతతో మేడయంతయు మాఱుమ్రోసె. తోడనె యాఁడుగూబ టపటప కొట్టుకొనుచు నటకరుదెంచి మగనిఁగాంచి ప్రియుఁడా! నన్నుఁ బిలిచిన పని యేమి? ఇంతలో మేల్కొలిపితి రేల? యని ప్రశ్నింప నదియు తన చంచూపుటంబున బాలికయంగుళినున్న యుంగరము చూపెట్టి పిలిచినపని వచించె. అంతలో బాలిక యటకరుదేర నా దివాంధము రాజపుత్రీ! యొకచేతితో నన్నును మఱొక చేతితో నీపెను గట్టిగఁ బట్టియుండుము. పిదప మేమిద్దఱ మాకసమున కెగయుదుము. ఇటకు దాపుననె పెద్దపొద యొకటి కలదు. దానిమీఁదుగ మేమేఁగుచుందుము. అప్పుడు చల్లగ మము విడిచి దానిపై దుముకుము. అది పలురకముల

పత్రములతో మెత్తవోలె మెత్తనైయుండు. కావున నీ కాయమున గాయములంటవు. అని వచింప నారాజపుత్రి తన హస్తద్వయంబున నాపక్షిద్వయమును గట్టిగఁ బట్టియుండె.

అంత నా యులూకదంపతులు నింగినెగయుచుఁ బొద మీఁదుగ నేఁగుచుండె. తోడనె రాజపుత్రి మెల్లగఁ జేతులు విడిచి పొదపైఁ దుమికెను. పొదయు దట్టముగా నాకులు గొమ్మ లావరించి యుంట బాలిక కాయమిసుమంతయుఁ గందదయ్యె. పిమ్మట నాపె మెల్లమెల్లగఁ బొదనువిడిచి సమతలమునకు విచ్చేసె. "శత్రువులకంటఁబడితినేని తత్క్షణము నావెంటఁ బడుదురు. కావున నేదారి నేగుదునా"యని పలుదారులఁ బరికించు చుండెను. కాని యాపె యదృష్టవతి. రాజపుత్రి నన్వేషించుచు నొకభటుఁ డా మేడకడ కరుదెంచు చుండె. రాజపుత్రి యాతనిఁ గాంచినది. ఆతఁడు మాత్ర మాపెను గానఁడయ్యె. తోడనె రాజపుత్రి యతఁ డేతెంచు వీథి విడిచి మఱొక వీథిని బరువెత్తసాగె. అటులాపె కొంత దవ్వేఁగఁ గుడివైపున ప్రాకారమునకొక ద్వారము కాననయ్యె. అంతలో తద్ద్వారము మెల్లఁగఁదెరువఁబడెను. అదిగని రాజపుత్రి యటనొక ద్రాక్షపొదలో దాఁగుకొనెను. అంత నొకదాసి ప్రాకారద్వారము వెలువడి యటునిటు పరికించి యొక్కపర్వున వీథిచివరదాఁక నేఁగెను. పిమ్మట నెటకేఁగెనో కానఁబడదు. రాజపుత్రి తోడనె వెలువడి ద్వారముకడ కరిగె. అట కవాటమొకించుక తెఱచి లోనికిఁ దొంగిచూచెను. అదియొక పెద్ద తోఁట. గొప్పగొప్పచెట్లు గుబురుకొని దట్టముగ వ్యాపించి

యుండె. అందు మానవమాత్రుఁడు గానరాఁడు. దానికవ్వలి వైపున మిద్దె కాఁబోలు తెల్లగ కానఁబడుచుండె. ఈ వీథి యెట కేఁగునో యెఱుఁగరాదు; కావుననిచ్చటనెదాఁగియుండుటశ్రేయమనుకొందు"-నని రాజపుత్రి చెరచెర నందుఁజొరఁబడి దాపుననున్న ద్రాక్షపొదలో దాఁగుకొనెను. తోడనె కవాటము తెఱచిన ధ్వని వినవచ్చె. అంత నాపె వెఱఁగందుచు తొంగిచూడ మఱల నాదాసియె లోనికేతెంచి కవాటబంధనము గావించుచుండెను. గావించి తోఁట కవ్వలనున్న మిద్దెదారిని బరుగెత్తెను. పిమ్మట రాజపుత్రి సూర్యరశ్మియుఁ జొరరాకుండ దట్టముగ నాకులు గొమ్మ లావరించిన తమాలవృక్ష మెక్కి "రాత్రియగుదాఁక నిచ్చటనె దాఁగియుందు; పిమ్మటఁ దారానాథు నింటి కేఁగవచ్చును. ఆ దంపతులు యథాశక్తి నాకండగా నుండఁగలరు. దయాదేవియు నన్నెంతయు మన్నించును. వారుతక్క నొరులు నాకిట దిక్కు గానరారు."— అనుచు నటఁదరుశాఖను గూర్చుండెను.

నాఁటి పగలాపె కొకయుగముగఁ దోఁచినది. పద్మబాంధవుఁ డపరాంబుధిఁ జొచ్చెను. అంధకారము నలువంకల నావరించెను. కాని రాజపుత్రి నడురేయిదాఁక నట వీడి తారానాథునింటి కేఁగ సాహసింపదయ్యె. మధ్యేమార్గమున రాకపోకలు గావించువా రెదురుపడవచ్చును. దానఁ దానేరికైన నెఱుకపడకపోదు. కావున నర్ధరాత్రము దాఁక నచ్చటనె కాలము గడప నెంచెను. రాత్రి సగము గడచినది. ఆకైనను గదలిన జాడ గానరాదు. అంత రాజపుత్రి వృక్షుంబు

దిగ్గి ప్రాకారద్వారము వివృతముకావించి తిన్నగ ప్రాఁతమేడ యున్న తోఁటఁ బ్రవేశించె. పిమ్మట నా చిమ్మచీఁకటిని తడబడు నడుగులతో మెల్లగ తారానాథు మాదిర ప్రాకారము కడ కరిగెను. దానిని దాఁటవలయు. పిమ్మటఁ దారానాథు నిల్లు చేరవలయును. ప్రాకార మత్యున్నతము. దానిని దాఁట రాజపుత్రికి శక్తి చాలదు. కావున కర్తవ్యము తోఁపదయ్యె. ఇంతలో మినుమినుకు మను నక్షత్రకాంతిలో టపటపఁ గొట్టుకొనుచు మింట నేఁగు నులూకదంపతు లా రాకన్నియకుఁ గానవయ్యె. తోడ్తో నవ్వానిరాఁబిలిచి "నాకాప్త మిత్రములగు కీరంబు గాని కాకంబులు గానీ కానుపించెనా?" యని ప్రశ్నింప దివాంధములు నట గోడపైఁగూరుచుండి "ఆఁ! చూచితిమి; చూచితిమి. అప్పక్షిత్రయ మీ పాడుమేడయందె నివసించుచుండె. పవలెల్ల నిన్నన్వేషించి యిట కేతెంచి నిద్రించినవి." అన విని రాజపుత్రి-"అగుచో దయయుంచి నన్ను నా యాప్తులఁ జేర్పుఁడు; మీ కెంతయు కృతజ్ఞురాలను" అని విన్నవించె. అంత నొక దివాంధము ప్రాఁతమేడ కడ కరిగి కల వృత్త మెల్ల నెఱుకపఱచి కీరమును వెంటనిడుకొని రాజపుత్రి కడ కేతెంచె. చిలుకయు నుప్పొంగుచు నేఁగుదెంచి యాపె బాహుపీఠము నధిష్ఠించి—మాటిమాటి కఱచియు సంతోష మున మైమఱచియు, పలుమాఱు — ముద్దిడుకొని బిడ్డా! నిజముగ నీవు నా రాజపుత్రివేనా? ఇది కలగాని కల్ల గాని కాదు గదా? నిన్ను నే మఱలఁ గలియఁగంటినా? బిడ్డా!—నీ వేచిక్కులఁ జిక్కియుంటివో యని బిట్టు వగచితిమి.

ఏ రక్కసుల బారిఁ బడితివో యని పెల్లు దురపిల్లితిమి. చుట్టుపట్టుల నెల్ల నిన్నన్వేషించువారమై చుట్టివచ్చితిమి. ఇఁక ఋణానుబంధము చెల్లెనని చాల చింతించితిమి. కానీ కాళ్ళ నోపిక యున్నదాఁకఁ జూతమని ప్రతిన వట్టితిమి. ఇదిగో తల్లీ! బంధము లెట్లు విడివడియె? యెచట కేగితివి? ఇంతదాఁక నెట నుంటివి? అర్ధరాత్ర మీరాకయేమి? యని మాఱుమాట వినకయె గ్రుచ్చిగ్రుచ్చి యడుగ రాజపుత్రి కలవృత్తమెల్లఁ దెలియఁ బలికె.

మఱియు నా చిలుకం జూచి—నేనిపుడు తారానాథు నింటి కేఁగవలయు, నన విని చిలుక—అమ్మా! వలదు వలదు, అట కేఁగవలదు. నీకు బదులుగ దయాదేవి నా పాపులు బందెవైచిరి. నిన్ను నట్లు కావింతురు. పాప మాదంపతులు కడుపాకలియు, కంటినిద్రయు నెఱుంగరు-అని వచించె. అప్పలుకులు రాజపుత్రికర్ణపుటంబులకు ములుకులై నాటఁ జింతాశోకము లతిశయిల్లె. అంత— తత్‌క్షణ మామెను విడిపింతు. నే నా పాపులబారిఁ బడుదును. కూఁతు కొఱకా దంపతులు క్రుంగి కృశింపనేల;— ఆ పాపము నన్నంట నేల! ఇప్పుడె నాప్రతిన చెల్లింతు" ననుచు నామె పయనమయ్యె. అది గాంచిన చిలుక "ఆఁగు మాఁగుము. ఇట్టి పాడుబుద్ధియె పాడమె నేనిఁ గొంచె మాఁగుము; నేనును నీవెంటవత్తును. కాకంబుల నా మేడకడనె యుండుఁడని చెప్పివత్తును. అవసరమగుచో నవి మనకండగా వచ్చును"—అని కాకంబుల కడ కేఁగి రాజపుత్రితలంపును తన యాజ్ఞయు వివరించి, తోడనె రాజపుత్రిదగ్గ

ఱకు విచ్చేసి యాపెయొడిలో దాఁగుకొనెను. పిదప రాజపుత్త్రి యటకు దాపుననున్న చిన్నవీథిని బయనమై తిన్నఁగ దారానాథునింటి ముంగిలి కేఁగి తలుపును గట్టిగ తట్టెను. అంతఁ గొంత తడవునకు వృద్ధదాసి యొకతె గవాక్షద్వారమున తొంగిచూచి యెవరది? యన రాజపుత్త్రి—నన్ను రాధాదేవి యందురు. లోనికి రావలయునని వచించెను. అది విన్న దాసి తోడనె కవాటము తెఱచి యాపెనులోనికిఁ దోడ్కొనిపోయె. ఆ దాసియె దయాదేవిని పెంచి పోషించిన యుపమాత. పాప మాపె రాజపుత్త్రి నెఱింగినంతనె ఱొమ్ముఱొమ్ము బాదుకొని యేడ్చుచు దయాదేవివృత్తాంత మామూలము చెప్పసాగె. అంత రాజపుత్త్రి యూరడిల్లు మూఊరడిల్లుము. మందభాగ్యురాలను; ఆపెచరిత యింతకు మున్నె యెఱింగితి. నన్ను గుఱిచి యాపెకీ యాపద రానీను. నేనె వారిబారిఁబడుదును. కమలాదేవి యెక్కడ? ఒక మాఱామెను జూడవలయు. నావిని దాసి యామె నంతిపురమునకుఁ దోడ్కొనిపోయె. అట రాజపుత్త్రి కమలాదేవిని గాంచినంతనె "నేనాపాపులబారిఁ బడి నీకూఁతు విడిపింప నిట కరుదెంచితి ననుచుఁ నాపెదగ్గఱ కరిగెను. కమలాదేవియు దిగ్గున పాన్పుడిగ్గి రాజపుత్త్రిని మఱల మఱల ముద్దిడుకొని కంఠమునఁ గౌఁగిలించి యొక్కపెట్టున నేడ్వసాగె.

దయాదేవితక్క నాదంపతుల కితరసంతతి లేదయ్యె. ఆపెను రక్షింప రాజపుత్త్రితక్క మఱొకవ్యక్తియుఁ గానఁబడదు-

కావున కమలాదేవికి రాజపుత్రిదృఢప్రతిజ్ఞను వారింప మనసొప్పి నదికాదు.

రాజపుత్రికి నాఁటిపగలు పగతుర బన్నములఁ దగు ల్కొనుటయు—వానిని దొలఁగించుకొనుటయుతోడనె గడచి నది. కాని తిండి తినుటకైనఁ దీరినది కాదు. కావున నాఁకలి డప్పు లతిశయిల్లె. దాని కలసటయుఁ దోడయ్యె. వెంటనె మూర్ఛవోయి పుడమి కొరిగెను. అంతఁ గమలాదేవి యిదేమి కర్మమే! యనుచు దాసిని బిలిచి సంభ్ర మమునఁ గరములు కంపింప నాపె నొక మృదుల శయ్యను శయనింపఁజేసె. అంతఁ గొంత సేపటికి రాజపుత్రి స్మృతికలుగు టయు నోగిరము కొంత యారగించి నిద్రించెను. మఱు నాఁడు తెల్లగతెల్లవారినంత మేలుకాంచె. భోజనములు ముగిసి నవి. తోడనె కమలాదేవి నాథుడగ్గఱి రాజపుత్రీనిశ్చయ మెఱిఁగించెను. దాని కాతఁడదృుతమంది—కట్టా! బాలిక యయ్యు నిట్టి ధార్మికత యెట్లు నేర్చె నని యచ్చెరువందె. అంత రాజపుత్రి—అమ్మా! పోయివచ్చెద నని కమలాదేవిని వీడ్కొని పనికత్తెల బందెకడ కేఁగు తారానాథు వెంబడించెను.

అటు లేఁగు నాయిరువ్వురు పనికత్తెలబంధనాలయము చొచ్చిరి. అటఁ దారానాథుఁడు కారాగారాధికారిని డగ్గఱి తా వచ్చినపని క్రమముగ విన్నవించె. అది విని యాతఁడు అదిగో! పనికత్తెలపరిశీలనకై మంత్రి యట కరుదెంచెను. వారికి నీ విన్నప మెఱిఁగింపుము. ఆతనిమాటయె శిలాక్షరము—అని

వచించెను. పిదపఁ దారానాథుఁడు మంత్రికడ కేఁగి కలవృత్త మెఱిఁగింప నాతఁడు—"ఆమాట నిపుడు తలపెట్టరాదు. మాపెద కురి రానున్నది. కాదగ్గధన మింతకు వసూలు కాదయ్యె. రాజు మఱల నగరమున చాకిరికిఁ బనికివచ్చు బాలబాలికల నెల్లరఁ బట్టితెండని యానతిచ్చె. కావున నీబాలికనుగూడ బందె గావింతుము. నావిని తారానాథుఁడు సవినయముగ విన్నవించెను. కాదని బెట్టిదముగ బెదరించెను. విధిచేఁతకు దుఃఖించెను. కోపావేశముచేఁ బెదవు లదరెను. కాని మంత్రిపై నాతనిమగఁటిమి చాలదయ్యె. కానిచో నేమయ్యెడిదో!

అంతనాతఁడు తిన్నగ రాజమందిరము చేరెను. అట ప్రేనితో నిట్లు విన్నవించె:—మహారాజ, నా పనికత్తెకు బనులుగ నాకూఁతుఁ బట్టితెచ్చినవార్త దేవరవా రెఱుఁగకపోరు. పిదప నా పనికత్తె స్వయమరుదెంచి బందెకొప్పుకొనియె అంత నా కూఁతు విడిపింపుమని మంత్రికి విన్నవించితి. కాని వినఁడయ్యె. ఎంతయొ విలపించితి. అదియంతయు వృథయయ్యె. తుదకు గతిగానక మీకడ కరుదెంచితి. దేవరచిత్తము—రాజది విని యిఁక నావంతయుఁ బ్రయోజన ముండదు. వశము తప్పినది. అనుకొన్న ధనమింతకు వసూలు కాదయ్యె. కానిచో రాణి కోపించును. అదియంతయుఁ బనికత్తెల మూలముననె కావలయు. మఱొకదారి కానుపింపదు. కావున నాపెవిడుదల వీలుకాదు—అని గంభీరముగ వచించి యిన్నకుండెను. పిమ్మటఁ దానాథుఁడు హతాశుఁడై యింటికి మఱలివచ్చెను.

బాలిక లిద్దఱొక గదియందె బధింపఁబడిరి. కీడులో మేలుగా నదియె వారిహృదయమున కొకింత యాశ్వాస కారణమయ్యె. ఆ గదియు చాలచిన్నది. దానికిఁ జిన్నగవాక్ష మొకటి మాత్రమె కలదు. వాయుదేవుని కందు పూర్ణనిషేధమె. చిలుకమాత్ర మద్దానిమూలమున రాకపోకలు గావింపవచ్చును. మఱునాఁటి ప్రాతస్సమయముననె దయాదేవి తల్లికొక లేఖ వ్రాసి నగరవార్తఁ దెలిసిరాఁ జిలుక నటనుండి వెడలించెను. చిలుకయు వేగిరము నగరమునకేఁగి తిరిగి యటకు విచ్చేసెను. విచ్చేసి, రాజపుత్రి! తారానాథుఁడు దయాదేవివిముక్తికై పలు పాములు పడుచుండెను. కాని తగినంతధనము సమకూర్పఁ జాలఁడయ్యె. కావున నీకనాపెవిముక్త్యాశ యడుగంటినది. అది గాక రెండుమూన్నాళ్ళలో సైన్యము కాశ్మీరమేఁగును. దానితో గూడ మిమ్ములను గొనిపోదురు. తిరుగ నీ వా రక్కసియగు రాణిచేతులఁ జిక్కుకొందువు. పాపము! ఎండకన్నెఱుఁగని దయాదేవియు నిడుమలు గుడువ వలసె. కానిండు; కష్టసుఖములు కాఁపురముండవు. రేయుంబవళ్ళువోలె జ్యోత్స్నాంధకారముల చందమున సుఖదుఃఖములు తిరుగుడువడుచుండు. అవ్వానిని గాలానుకూలముగ ననుభవించుచు ధీరులగువారు కాలము పుచ్చుచుందురు. కాని పవలుకన్న రాత్రియు వెన్నెలకన్నఁ జీకఁటియు దీర్ఘముగఁ దోఁచుమాడ్కి కష్టకాలమెక్కుడగఁ గన్పట్టుచుండు. అది లోకమునకు సహజము.

ప్రకృతమున కొకయుపాయ మరయవలయు. సత్యవ్రతమాయుంగరము నాకందిమ్ము. అద్దానిని గొని కాకంబులకిచ్చి

మీ మాతామహుల కడ కంపుదును. ఆతఁడెట్టి యిక్కట్టుల నైన త్రుటిమాత్రమునఁ దలగింపఁ గలాఁడు. ఉపాయమున నెంత వారి నైన క్రిందుమీఁదులు కావింపఁగలఁడు. ఇంతదాఁక నీవసువులు గలిగియుంటకుఁ గారణ మాతఁడుగాక మఱెవ్వఁడు? కాని యుంగర మాతనికి సాయ ముండవలయు. అద్దానితో నింగినెగయు నీడోద్భవముల నెల్ల నొక్కదారిఁ బట్టింపఁగలఁడు. అవ్వానిని దన చెప్పుచేఁతల మెలఁగింపఁగలఁడు.—అనుచు నయ్యుంగర మందుకొని శీర్ణసౌధముకడ కేఁగెను. ఏఁగి కాకంబుల నటకురాఁబిలిచి యందొకదాని కుంగర మొదిచ్చి—"వేగిరము గంగోత్రి కడ కేగుము; ఈ యుంగర మాయోగి పుంగవున కందింపుము. ఇట నడచిన దంతయు నాతని కెఱిఁగింపుము." అని చెప్పి రెండవదానిం జూచి "కాశ్మీర సైన్య మిప్పట్టణము వీడునందాఁక నిచ్చటనె వేచియుండుము. అది యిట నుండి పయనమయ్యెనేని దాని వెన్నాడి యేగుఁచుండుము"—అని యానతిచ్చి రాజపుత్రికడ కేతెంచెను.

రాజోద్యోగులు మఱునాఁటి ప్రత్యూషముననె బాలికలతోఁ బాటు దాసదాసీజనమును నౌకరులను సైన్యమునఁ జేర్చి దళవాయి కప్పగించిరి. తోడనె సైన్య మటనుండి పయనమయ్యెను. బాలికలిర్వు రొక డోలిక నెక్కి యేఁగుచుండిరి. చిలుకయు వారివెంబడించెను.

బాలికకడ నుంగరము లేదయ్యె. కావున చిలుక, రాజపుత్రితో భాషింపను మంచిచెడ్డ లెఱిఁగింపను వలను కాదయ్యె.

---

# తొమ్మిదవ ప్రకరణము

కాశ్మీరదేశపుఁ బొలిమేర నిసుకవైచిన రాలకుండఁ జనులు త్రొక్కిసలాడుచుండిరి. అశ్వముల హేషలు కరుల ఘీంకారములు పదాతుల జయఘోషములు యజమానుల యదలింపులు-ఒండొరుల బెదఱింపులతో దిక్కులు మాఱు మ్రోయుచుండెను. సైనికులందఱు గెలుపందిన యుత్సాహమునఁ గేకిసలు కొట్టుచుండిరి. కప్పముగాఁ గొన్నధన మొకవంక, దోఁచితెచ్చిన మణిభూషలరాసు లొకప్రక్క, దాస్యమునకుఁ గొనితెచ్చిన బాలబాలికానివహ మొకయిక్క, పట్టితెచ్చిన గజతురగాదు లొకవలను, కానుకగాఁ గొన్న కాల్బల మొకచోటను, విలువగల దువ్వలువ లొకపట్టునను, దర్శనీయముగఁ బ్రదర్శనము కావించి రాణిరాక కెదురు చూచుచుండిరి.

అట రాణి యొకమత్తగజము నధిష్ఠించెను. ఆపె వెనుక నందలమున భృత్యుఁడు కూర్చుండెను. గజముమీఁది పట్టుగవిసెనయు దానిపైనున్న యంబారియుఁ దళతళ మను కాంతుల నీనుచుఁ జూపఱచూపులకు మిఱుమిట్లు గొల్పుచుండెను. పిమ్మట నాపె చెలులు—చుట్టలు మున్నగువారెల్లరు శిబికల యందు నశ్వములమీఁదను తీర్చికూర్చుండిరి. ఆవెనుక సైనికనికాయము బారులు తీరియుండెను. ఈతీరుగఁ గొలువువారుదఱు వెంటరా, సమరవీరుల సదమదించిన సైనికకాయము నాహ్వానింపను, నరాతిసైన్యము నడఁచితెచ్చిన

యర్థరాశిని వీక్షింపను, దాస్యమునకుం గొనితెచ్చిన దాసీ జనమును దర్శింపను, బయనమై యటకేతెంచెను.

అట వరుసగ బారులుదీరి నిలిచియున్న బాలికానివహము కడకేఁగెను. తత్క్షణ మాపెచూపులు రాజపుత్రిపైఁ బ్రసరించెను. అది గన్న రాజపుత్రికి హృదయ మదరెను. తోడనె కాయము కంపించెను. మోము కందువారె. కాళ్లు గడగడ వడఁక సాఁగె. పిదప, రాణివెనుకఁ గూర్చున్న నౌకరు రాణినిఁ బిలిచి మెల్లగ నేదియొచెప్పి రాజపుత్రిని జూపించెను. మొదట నాతఁడు కొంత తటపటాయించెను. తోడ్తోన గజావతరణము కావించి దళవాయిదగ్గఱకేఁగెను. ఏఁగి యాతనికి రాజపుత్రినిఁజూపెట్టి యీపె రాణికెంతయుఁగూర్చునది. నిరత మీమెను తనదాస్యమున నుంపఁగోరినది. కావున రాణి తనతో నీపెను గొనిపోవును. యుద్ధము కొఱకు చాల ధనము వెచ్చించితిమి. కావునఁ దక్కుంగల వస్తువులను వాహనములను పనికత్తెల నందఱను గూడ విక్రయింపవలయు. కానిచోఁ గోశాగారమునఁ గొఱవడ్డ ధనమును బూరింపఁజాలము"—అనుచు తిన్నగ రాజపుత్రికడ కేఁగి యాపెచేయిపట్టుకొని—"దీని మనకడనె యుంపుఁడు"—అని తోడివారల కప్పగించెను.

రాబందులు కాఁబోలు; గరుడపక్షులఁబోలు పక్షుల సమూహ మొకటి నింగి నతిదూరమున నెగయుచు నేఁగు దెంచుచుండె. అప్పక్షిసమూహము నడుమ నొక శయాకృతి యుద్దవోలెఁ గానఁబడుచుండె. అట్టులెగయుచు తెల్ల

పాటులో సైన్యముకడ కరుదెంచి యాకసమునను చక్రము వోలె గిరగిర తిరిగి యొక్కమారుగ నాఁగిపోయె. వెదురు కఱ్ఱలు రెండు పీఁటగ నమర్పఁబడి మూలవాటుగఁ గట్టఁబడి యుండెను. నడుమ నైదారు త్రాళ్లు బాధింపఁబడినవి. అవ్వాని కొట్టకొనలను విహంగములు తమకాలిగోళ్లను బట్టి మెగయు చుండెను. కఱ్ఱకొనల నాల్గింటిని మఱినాల్గు సీడజంబులు పట్టి యుండెను. వానినడుమ నొకవృద్ధుఁడు కూర్చుండియుండె. ఆతని నుదురు వెడల్పు. గడ్డము పొడవు. వక్షము విశాలము. దుస్తులు కాషాయములు. అది గాంచినసైనికులెల్లరు సంభ్రమాశ్చర్యము లినుమడింపఁ గన్నార్పకయె కాంచుచు బొమ్మలువోలెఁ గన్పట్టిరి.

అంత నయ్యోగిపుంగవుఁడు పక్షిగణంబుతో దళవాయిని డగ్గఱి-సమరవీర! మురారిసింహా! మీ పూర్వపుటేలిక యిట కేతెంచినాఁడు. ఒకపరి దృష్టి నిటుసారింపుము. రాజోద్యోగు లెల్ల రవిధేయులై విశ్వాసహీనులై రాజద్రోహులై నాపై దండెత్తి నన్ను గద్దెనుండి తలఁగించిననాఁడు నిసుమంతయు సడలని నీ ప్రభుభక్తి యే నెఱుంగుదు. అట నీవున్నచో నాఁటి యోటమి నాకుఁ బాటిల్లెడిది కాదనియు నాకు విదితమె. పిదప నే యోగసాధనకై గంగోత్రి కేగుదాఁక నా పగతునానతిఁ దలఁదాల్పకుంటయు నే విన్నాఁడను. నేఁటికి నా రాచఱిక మాకాంక్షించు నీయుబలాటము నే నెఱుఁగక పోలేదు. ఇప్పుడైన మించినది లేదు. తత్క్షణము నీపాతరైతు నాదరింపుము. నాపగతు నిప్పుడె మార్కొందును. అద్దానికి నీవు తోడుపడుము. అని పెద్దయెలుంగున హెచ్చరించె.

అది విన్న దళవాయి మొదట నాతని వాలకముచూచి విశ్వసింపఁడయ్యె. కాని కంఠస్వరము గమనించి తోడనె తన యొఱనుండి ఖడ్గము నూడఁబెఱికి, చేయెత్తి—సైనికులారా ! రూపెత్తిన మన భాగ్యరాశియో యన మన యేఁడిట కరుదెంచినాఁడు. కావున, నాయెడ నేకొలందియైన విశ్వాసముండెనేని—ఇమ్మహానుభావుఁడె ప్రభుఁడు కాఁగోరుదురేని—ఒక్కుమ్మడి మీచేతుల పైకెత్తుఁడు. అనునంతలో మహారాజునకు జయ్; మహారాజునకు జయ్ అను జయజయధ్వానంబులు మిన్నుముట్టెను. భటులెల్లరు వీరావేశ మినుమడింప నొఱలనుండి కత్తులఁ బెఱికి త్రిప్పసాగిరి. అప్పుడవి రాజపుత్రిని పలుబాముల పాలుచేసిన కాశ్మీరరాజ్ఞిని గాటందనేగు కాలసర్పములువోలెఁ గన్పట్టుచుండె. పట్టుఁడు—పట్టుఁడు; కొట్టుఁడు; పరువెత్తుఁడు—ఆలసింపకుఁడు—అని యొక్కుమ్మడి నఱచుచు, త్రొక్కుడువడుచుఁ బరువెత్తసాగిరి.

అది గాంచిన నొకరిడెందము దందడిసెందెను. శరీరమున ముచ్చెమటలు గ్రమ్మినవి. కాళ్లు గడగడ వణఁకినవి. తోడనె రాణికడకేఁగి గజము నధిష్ఠించి—అమ్మా! యిఁక మనమిట తడయరాదు. బ్రతుక తావుండదు. శత్రువదె మనపై దుముకనున్నాఁడు. సైన్యమంతయుఁ బగతుపక్షము చేరినది. అదిగో! మనల ముట్టడింప నిటు పరుగిడుచున్నది. ఇఁక మన మానప్రాణములు దక్కవు"—అని మావటీనిం గాంచి—"ఏనుఁగును వేగము నగరి కేఁగనిమ్ము; అందెందైన దాఁగియుంద" మని తడఁబడుచు హెచ్చరించె. అది విని మావటీఁడు-

అంకుశమ్మున దాని నొక్కపోటు పొడువ నదియు నామడ కడుగుగాఁ బరుగిడసాగె. ఇంతలో మురారి సింహుఁడు-గుఱ్ఱపు రౌతులం గాంచి "రాణి పరువెత్తుచున్నది;—త్వరగ నేగి ముందు వెనుకల ముట్టడింపుఁడు-వెంటనె పట్టి బంధింపుఁడు"-అని హెచ్చరించె. విలుకాండ్రెల్లరు తమ విండ్ల నెక్కిడి వారి వెంబడించుచు మావటీని బిలిచి-"ఆఁగు మాఁగుము-లేనిచో, మాబాణోరగంబులు మీ ప్రాణవాయువులఁ గొనకమాన" వనుచు విండ్ల నాకర్ణాంతము లాగి బెదరింపసాగిరి. అంత నమ్మావటీఁడును పరుగెత్తిన ప్రయోజన ముండదని యేనుఁగు నదలింపఁడయ్యె. తోడనె భటులంద ఱామెను ముట్టడించి భృత్యునితోపాటు పట్టి బంధించిరి.

పిదప నయ్యోగిపుంగవుఁడు నౌకరులు, పనికత్తెలు గలచోటికేఁగి నాదాహిత్రి యెక్కడ? యని ప్రశ్నింప తోడ్తోన రాజపుత్రి యాతని పాదములకడ వ్రాలెను. అంత నాతఁడు రాజపుత్రిని బట్టియెత్తి శిరము మూర్కొని మఱల మఱల ముద్దిడుకొనెను. తోడనె తన వాహనమెక్కించుకొని తోడ్కొని పోసాగె. అంతలో రాజపుత్రి యడ్డుపడి, తాతా; నాచెలికత్తెను దయాదేవిని గూడ తోడ్కొనిపోద మని వచింప నామెనుగూడ నొకప్రక్కఁ గూర్చుండఁజేసి నగరమునకుఁ బయనమయ్యె. సైనికులెల్లరు జే, జేలు గొట్టుచు వాని వెంబడించిరి. చిలుకయు సైనికుల జయజయధ్వానములచే శరీర ముప్పొంగ బాలికబాహువునఁ గూర్చుండె. కాకంబులు మిన్నంటిన సంతసమున మింటనెగయుచుఁ బూర్వపరచితమగు

మందిరోద్యానమున కేఁగి విశ్రమించెను. రాబందులు నయ్యోగిపుంగవుని సెలవడిగి తమ నెలవుల కరిగెను.

పిదప నయ్యోగి నగరమాక్రమించి గద్దె నధిష్ఠించి రాజయ్యెను. మంత్రులు—సామంతులు, హితులు—పురోహితులు, భటులు—రాజభటులు, మున్నగు పరివారము కొలువు దీరియుండిరి. రాజు కనకాసనమున నుపవిష్టుఁడయ్యె. బాలిక లిర్వురు తాతకడనె కనకమయపీఠమునఁ గూర్చుండిరి.

అప్పు డారాజపుంగవుఁడు పెద్ద యెలుఁగున-మంత్రిపుంగవా! వేగము రాజభటుల నంపి దయాదేవి తలిదండ్రులఁ బిల్వనంపుము. రాజమందిరమున కంతికమున నొక సుందరమగు సౌధము గట్టించి వారి కధీనము కావింపుము. మఱియుఁ దారానాథునికి న్యాయమూర్తి పదవి నిప్పింపుము. నా దౌహిత్రి ప్రాణరక్షకుండు దీనదయాళుండు నగు జాలరిని రాఁ బిలిచి సామ్రాజ్య నౌకాధిపత్య మిప్పింపుము.-మఱియు నా పాపురాలు పట్టి తెచ్చిన పనికత్తెలను, నౌకరులను, వెయ్యేల-ఆపె తెచ్చిన పుచ్చుపుల్లయు నట విడిచిరా బంటుల నిప్పుడే వెడలింపుము. రాణి చేసిన దుష్కృత్యముల కురిశిక్షయె రాజశాసనము; అయినను స్త్రీహత్యాపాప మంటకుండ నాపె కాజన్మము కారాగారవాసము విధింపుము. ఆ పాతకినిమీఁదఁ బ్రసరించిన గాలియు రాకుండ నగరమునకు నాల్గుక్రోశముల కవ్వల ప్రాంతకోటలో బంధింపుము. ఆపె పుత్రుని సంస్కృత భాషాభ్యాసనమునకై వారణాసికిఁ బంపింపుము. భృత్యుని

ప్రాణముతో నీదేశమునుండి వెడల నడుపుము. దేశమునఁ జెఱ సాలలలోని బందీల నిప్పుడె విడుదలఁ గావింప నుత్తరువు వెడలింపుము." అని యానతిచ్చి నాఁటికిఁ గొలువు చాలించెను.

ఈ తీరుగ నాతఁడు దుష్టశిక్షణము శిష్టరక్షణము కావించుచు రాజపుత్రిని గన్నులఁ గప్పుకొనుచు నాపె పరిణయమగుదాఁక నచ్చటనె యుండఁదలచెను. అట లాహోరు రాజును తన సర్వస్వమును తన కంపిన విశ్వాసమునఁ గాశ్మీరపు ఏలిక యన్న మిగుల స్నేహభావమును — ఆప్త భావమును జూపుచుండె. నాఁడు నాఁటి కయ్యిరువురు బంధుగులు వోలె రాకపోకలు కావించుచు—ఆపదల నడ్డుపడుచు, విందువేళల తోడుగుడుచుచుఁ గలసి మెలసి మెలఁగుచుండిరి. లాహోరు యువరాజు కృష్ణనాథుఁ డప్పుడప్పుడు కాశ్మీర మేఁగుదెంచి విందులు గుడుచుచు మంచిచెడ్డలలో, మంతనములలోఁ బాలుగొనుచు రాజానుగ్రహపాత్రుఁడయ్యె. రాజును—ఆతని సుగుణసంపత్తిని వినయభావమును, ఉదారాశయమును, కలుపుఁగోలుతనమును గమనించి యాతని తన దౌహిత్రికిఁ దగినవరునిగా భావించి యెంతయు మన్నించుచుండె.

క్రమముగ రాజపుత్రికి వత్సరములు పదునెనిమిది గడచినవి. ఆపెకు తారుణ్యము ప్రాదుర్భవించినంతనె తనువున లావణ్య మినుమడించెను.

అంత నొకనాఁడు శుభవాసరంబున, రాజు మంత్రితో మంతనంబు సలిపి పురోహితు రావించెను. శుభలగ్నాదికమరసి లాహోరు నగరాధీశున కీరుగ లేఖ వ్రాయించి యటకంపెను.

"స్వస్తి శ్రీమన్మహారాజరాజశ్రీ లాహోరు నగరాధీశుని కాశ్మీరాధీశుఁడు కంఠమునఁ గౌఁగిలించి ముదమందెడు.

మన స్నేహభావము నాఁడు నాఁటి కభివృద్ధినందుఁగాక. ఇట నందఱకుఁగుశలమె. నావయసు చెల్లినది. ఏనిఁక రాజ్యభారము పూనఁజాల. పుత్రసంతతి లేమి విరాకెఱుకయె. రాధకు వయసు వచ్చినది. ఆమెకు వరునిగా నీ కుమారు నెన్నఁడొ నిర్ణయించితిమి. శుభలగ్నాదికము నరసితిమి. శుభలేఖ నీతఁడె మీకందఁ జేయు. నాఁటి శుభవాసరంబునకు బంధుమిత్ర పరివార సమేతముగఁ దరలి రావలయు".

అది గాంచిన లాహోరు సార్వభౌముఁడు సంతుష్టాంతరంగుఁడై బంధుజనులం గూడి కృష్ణనాథుని సర్వాభూషణ భూషితుఁ గావింప నాతఁడు భద్రగజము నెక్కి మంగళతూర్యనాదములు, వందిజనుల కైవారములు, మాగధుల గానములు,- అగ్రజన్ముల యాశీర్వాదములు, మిన్నుముట్టుచుండఁ బయనమై కాశ్మీర మేతెంచెను.

కాశ్మీరవాసుల కాదినము శుభదినము. నగరమందంతట నిత్యకల్యాణము పచ్చతోరణము. రాజులు — అధిరాజులు, మంత్రులు — సామంతులు, హితులు — పురోహితులు, భటులు- రాజభటులు, అర్హాసనములఁ దీర్చి కూర్చుండిరి.

వైవాహికవిధులు ముగిసినవి. దుందుభులు మ్రోసినవి. అక్షయ మగుఁగాక యని పెద్ద లక్షతలు చల్లిరి. మాగధులు పాడిరి. వందిజనులు పొగడిరి. దేవతలు పుష్పవృష్టి కురిసిరి. రాధాకృష్ణుల బ్రహ్మబంధము నాఁడు చూపఱకుఁ జూపట్టెను. కృష్ణనాథుఁడు కాశ్మీరసింహాసన మధిష్ఠించెను. బంధుగులిండ్ల కేఁగిరి.

అంత నొకనాఁడు రాజు మనుమలఁ జేరఁబిలిచి తండ్రీ! సర్వశాస్త్రముల నభ్యసించితివి. నీవెఱుఁగని రాజధర్మములు చూపట్టవు. అయినను రాజ్యభారవహన మఖిల దుఃఖావహము. ఇఁక నీవన్ననో! అనుభవ మెఱుఁగని కుఱ్ఱవు. కావున నింత చెప్పవలసె.

గురువుల గారవింపుము; వారి యలుకలు రాజులకుఁ దలముల్కలని మదినుంపుము. ప్రజలను దన ప్రజలవోలె మన్నింపుము; అట్టేఁడుకాని రాజు పెనుతరాజని తలంపుము. కులక్రమాగతులగు మంత్రుల నియమింపుము; వారితో విరోధము రాజులకు నిషేధమని భావింపుము. అరివీరులు కన్నెత్తి చూడరాని సమరవీరుని దళవాయిగ నేర్పఱుపుము; కాదేని కలిగిన సిరి పలుసిలుగులపాలగును. యోగ్యత తెలిసి యుద్యోగుల నియోగింపుము; కానిచో నదను కలిగెనేని పదునెక్కి మనలనె యదలింపఁజూతురు. సకాలమున వారికి వేతనము లందింపుము; వారి క్షుధానలము బడబానలమై రాజును దహించును. సమ్మాన్యులగు భృత్యుల సత్కరింపుము; వారు

సమరమునఁ దమ ప్రాణము సైతము తృణముగఁ జూతురు. యుద్ధమున నీకై సమసిన యుద్ధభటుల సంస్మరింపుము. వారి యనుజీవుల నాదరింపుము. వెదకిపట్టి, జార చోరాదుల సమయింపుము. కానిచో సజ్జనులకు సంకటములు కల్గింతురు. దానధర్మహాని వాటిల్లును. అగుచో దేశ మరిష్టావృతమై ప్రజలు పలుబాముల పాలగుదురు. ప్రజామోదము లేని రాజ్యము పూజ్యముకాదు.— అని దౌహిత్రిని గాంచి, రమ్ము రమ్మని చేతులచే చేరందివిచి యొడిని గూర్చుండఁజేసి బిడ్డా, కష్టములెన్నో గడచితివి. తుదకు శుభములు చేకూరె. పూజ్యమగు రాజ్యమప్పగించితి. మాన్యుఁడగు రాజన్యుని సమకూర్చితి. ఇతనిని ఛాయవోలె ననుసరింపుము. సరివారిని సన్మానింపుము; నిన్నాదరింతురు. దాసుల యెడ నీసు పూనకుము; నీ యడుగుల మడుగు లొత్తుదురు. భృత్యుల కహితమాచరింపకుము; నిన్నిసడింపరు. కలిమిఁ గని యుబ్బఁబోకుము; అది విద్యుల్లతవోలె క్షణభంగురము. లేమిఁ గని బేలపోకుము; నీటి బుడగవలె నిముస ముండదు. ఇంత యేల! సర్వమెఱింగి వర్తించుచు సుఖాంబుధి నోలలాడుఁడు. నేఁబోయివచ్చెద" నని మనుమలఁ జిరకాలము మనుఁడని దీవించి గంగోత్రికడ కేఁగి యోగివృత్తిఁ బూనియుండెను.



తెనాలి, భారతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె

# ముద్రణ దోషములు

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౦ | ౮ | స్పృతి | స్మృతి |
| ౩౫ | ౧౦ | తయ్యాబ్జావృక్షముల | తయ్యాబ్జాలతల |
| ౩౮ | ౨౨ | పాతకి | పాతకిని |
| ౪౧ | ౧౧ | పోఁకలం | పోకలా |
| ౪౮ | ౧౦ | మఱిచితి | మఱచితి |
| ౪౯ | ౭ | విశ్వషింప | విశ్వసింప |
| ౫౦ | ౧౫ | ణముల | ణమున |
| ౫౨ | ౨ | పుటుంబుల | పుటంబుల |
| ౫౩ | ౧౪ | అశ్లేర్పఱించిన | అశ్లేర్పరించిన |
| ౫౪ | ౧ | యొకటి | యొకతె |
| ౫౭ | ౭ | తాఁ | అట తాఁ |
| ౬౦ | ౩ | చిత్కితివి | చిక్కితివి |
| ౬౦ | ౯ | అగుటఁ దీని | అగుట దీని |
| ౬౬ | ౬ | పొదపైఁ దుమికెను. | పొదపై దుమికెను |
| ౭౦ | ౧౧ | మూఁడూరడిల్లుము | మూరడిల్లుము |
| ౭౩ | ౧ | బధింపఁబడిరి. | బాధింపఁబడిరి. |
| ౭౬ | ౭ | సాఁగె | సాగె |
| ౭౮ | ౧౦ | బెరిఁకి | బెఱికి |

